## విషయానుక్రమణిక



ఆంధ్రపత్రిక
సచిత్ర వారపత్రిక

వచ్చే సంక్రాంతికి, అనగా 14-1-54 తేదీకి ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికను ప్రత్యేకాకర్షణలతో వెలువరిస్తున్నాము. ఇందులో ప్రత్యేక రచనలు, చిత్రాలు, ఫొటోలు ఉంటాయి. సంక్రాంతి సంచికకోసం వ్యాసాలు, కథలు, చిత్రాలు, ఫొటోలు పంపదలిచిన వారు డిసెంబరు 20-వ తేదీలోగానే వారపత్రికకు చేరేవిధంగా పంపవలసిందని ప్రార్థిస్తున్నాము.

—సంపాదకుడు.

# అక్షర తూణీరం

## 1

ప్రస్తుతానికి స్టేటస్కో
ప్రకాశమూ ఎండ్ కో—
ప్రజానీకమూ మేలుకో
కొక్కొరోకో, కొక్కొరోకో!

పదిమందిలో నగుబాట్లకి
ఎవరిదంటావు బాధ్యత ?
భద్ర పరుచుకో నీక్షేమం
దొంగలున్నారు, జాగ్రత !

చూడు నేస్తం, ఎటుచూసినా
మోసగాళ్లదే అధికారం !
చూడకు చూడకెటు చూసినా
కళ్లలో పడుతుంది కారం.

నువ్వెప్పుడూ చీకట్లో వుంటే
ఎవ్వరేంచేసినా చెల్లుతుంది.
అందుకే దీపాలార్పేరక్కడ
పోగయ్యారు బోలెడుమంది.

రాజకీయాలూ, నాయకీయాలూ
కుళ్లినసరుకు, మూసుకో ముక్కు.
తుపానులాగ రా, సుడిగాలివై లే,
ఊడ్చేసుకో యింటిలో తుక్కు.

ఎర్రని శుభప్రభాత మదిగో
ఈ చీకటిరాత్రి తలుచుకో.
మేలుకో నేస్తం మేలుకో
కొక్కొరోకో, కొక్కొరోకో!

## 2

గట్టిగా తుమ్మితే ఊడిపోయే ముక్కు,
ఎందుకూ పనికిరాని పరమడొక్కు
వంటి ఓ మంత్రి వర్గమా !
నీపేరు త్రిశంకు స్వర్గమా ?
నా పేరు వేదబుక్కు కాదు—లిమరిక్కు!

ఈ సందిగ్ధ సమయంలో మనకేది దిక్కు ?
ఎన్నాళ్లకి తేలుతుందీ పొలిటికల్ చిక్కు?
మన స్థితి సెమీట్రాజెడీ,
కాకపోతే ట్రాజీ కామెడీ;
లవ్ లిరిక్కు మాత్రంకాదు—వొత్తి లిమరిక్కు!

ఏమైనాసరే, మనం నడవద్దు వెనక్కు;
అభ్యుదయం, ఆనందం మన జన్మహక్కు.
బ్లాంకు చెక్కు మనభవిష్యత్తు
బాంకు లోనిదంతా మనసొత్తు;
ఊరికేపోదు నా లిమరిక్కు—ఇది వేదవాక్కు!

—సవ్యసాచి

# కాలక్షేపం

తగజలరేఖచే వలయితంబగు
కొంచెపు మట్టి ముద్దకై,
జగడము లాడి యాడి, పెలుచన్
విభజించి, భుజించుచున్న దు
ర్భగ నృపు లిచ్చువారె? - తలపం
గడు నీచులు; - వారియందు నొ
ప్పగ ధనలేశ కాంక్షగల
పూరుషులుం గడు హీనులే కదా!

తా॥ సముద్రముచే చుట్టను ఆవరింపబడిన కొలది మట్టిముద్ద యీ భూమి. ఆటి మట్టిముద్దకై యుద్ధములు చేసి చేసి, దీనిని చాలామందిరాజులు పంచుకొని అనుభవించుచున్నారు. ఈ దౌర్భాగ్యపు రాజులు యితరులకు యిచ్చేవారా? వారు నీచులు. అట్టివారి వద్దకు కించిత్తు ధనమును పొందవలెనను కాంక్షతో వెళ్ళెడి పురుషులు కూడా హీనులే కదా.

తాపి ధర్మారావు

చాలామంది రాజులు యీ భూమిని జయించి ఏలుచున్నారు. అనేక రాజవంశములు యీ రాజ్యాలకోసం యుద్ధాలు చేశారు. ఒక రాజవంశంలో తండ్రిని చంపి రాజ్యానికి వచ్చిన కొడుకులున్నారు. రాజ్యానికి రావలసిన అన్నగారిని ఖైదులో పెట్టి రాజ్యానికి అధిపతులైన తమ్ములున్నారు. మొగలాయి చక్రవర్తుల వంశ పరంపరలో యిటువంటి ద్రోహాలు చేసినవారే పాదుషాలైనారు. సేనాధిపతిగా ఉంటున్నటువంటివాడు తనరాజు చనిపోగానే యువరాజు తరఫున తానే రాజ్యాధికారం వహించి, చిట్టచివరకు రాజ్యానికి తానే అధిపతియైన సందర్భాలు ఉన్నాయి. విజయనగర సామ్రాజ్య చరిత్రలో యిటువంటి ఘట్టాలు అనేకం ఉన్నాయి. సంగవంశం రాజులు పోయి తుళువవంశం వచ్చింది. తుళువవంశంలోనివాడే శ్రీకృష్ణదేవరాయలువారు. హరిహర రాయలు బుక్కరాయలు సంగం వంశరాజులు. కృష్ణదేవరాయల తర్వాత తుళువవంశపు ప్రభువు రాజ్యానికి రాలేదు. ఆరవీడు వంశపురాజులు రాజ్యాధికారానికి వచ్చారు. అళియరామరాయలు ప్రభుత్వాధికారంలోనికి రావడంతో ఆరవీడు వంశాధికారం ప్రారంభమైంది. ఈ విధంగా విజయనగర సామ్రాజ్య చరిత్రలో ఒక్కటే రాజవంశం మొదటినుంచి చివరివరకు రాజ్యం చేయలేదు. రాజులుపోయి, రాజులబదులు సేనాధిపతులు రాజ్యానికి వచ్చారు. తండ్రి చనిపోయి, యువరాజు మైనరు అయినప్పుడు, ఆ యువరాజును చంపించి పినతండ్రి రాజుఅయిన సందర్భాలు ఉన్నాయి. పీష్వానారాయణరావును వధించి - లేదా వధింపజేసి - పినతండ్రి రాజైనాడు. ఈ విధంగా రాజ్యాధికారంకోసం ఆయా రాజవంశాలలో జరిగిన ఘోరహత్యలవల దారుణద్రోహాలవల్ల యీ రాజ్యదాహాలు ఎటువంటివో బోధపడుతుంది. ఒకరాజుతో యింకో రాజు చేసిన యుద్ధాలకంటె యీ ద్రోహాలు చాలా ఘోరమైనవి. ఎందుచేతనంటే యిటువంటి హత్యలలోనూ, ద్రోహాలలోనూ, శౌర్యంగాని, పరాక్రమంగాని, క్షాత్రతేజంగాని, పౌరుషంగాని ఏమీ కన్పించదు. రాజ్యాన్ని జయించడం కాదిది. రాజ్యాన్ని హరించడం - ఇది క్షత్రియ శౌర్యంకాదు. ఇది క్షత్రియ చౌర్యం—ఆ రీతిగా రాజ్యాన్ని దొంగిలించినవాడు చోరచక్రవర్తి— అతడు రాజ్యమేలెడి ఏలిక కావచ్చు. కాని, ఎలుకవంటి ఏలిక. తన ముష్కరతత్వం చూపిన మూషికం. తన ప్రజలపై దొరతనం సాగించేటటువంటి యిట్టి దొర కేవలము దొంగతనములో దొడ్డదొర. రాజవంశముల చరిత్రలు యీ విధముగా నీతి విరుద్ధముగా ఉండడంవల్లనే వారు నీచులు అని నిందించడం సంభవించింది.

అంతేకాదు. సామ్రాజ్యానికి అధిపతియైనవాడు తాను కొన్ని ప్రాంతాలను జయించడానికి తన సేనానులనుససైన్యంగా పంపిస్తే ఆ సేనాని ఆ ప్రాంతాన్ని జయించి అక్కడ తానే సర్వాధికారినని చాటించుకొని, తన సామ్రాట్టుతో తనకిక సంబంధం లేదన్నట్లుగా ప్రవర్తించి, స్వతంత్రరాజు అయిపోవడం స్వామిద్రోహమే. కాని, అటువంటి స్వామిద్రోహులైన ప్రభువులు చాలామంది తాము తినినయింటికి వాసాలు లెక్కపెట్టినవారే. భామినీరాజ్యం ఆఖరుకు అయిదురాజ్యాలుగా చీలిపోయింది. (1) బీదరు, (2) బీరారు, (3) బీజపూరు, (4) అహమ్మదునగరు, (5) గోల్కొండ.

ఆ గోల్కొండ నవాబైన తానీషా వద్ద అక్కన్నమాదన్నలు దివానులుగా ఉండేవారు. వీరు నవాబుయెడల ఎంతో నమ్మకంగా, స్వామికార్యమే స్వకార్యంగా భావించి సేవ చేశారు. అయితే మాత్రమేమి? వారి అవసానకాలం అగౌరవం పాలయింది. వారి మేనల్లుడు కంచర్ల గోపన్నగారు మాత్రము భద్రాచలం తహసీల్దారుగా ఉండి తాను వసూలుచేసిన శిస్తు మొత్తమును తానీషాకు చెల్లించక భద్రాచలంలో రాములవారికి ఆలయం కట్టించి రాములవారికీ సీతాఅమ్మవారికీ ఆభరణాలు చేయించాడు.

"సితమ్మకు చేయిస్తి
చింతాకు పతకమూ,
ఆ పతకమునకుపట్టె
పది వేల వరాహాలు."

అని బాహాటంగా ప్రకటించాడు. కనుక, తానీషా సొమ్మును అపహరించాడే గాని ఆ విషయమై అసత్యమాడలేదు. అయినప్పటికీ, తానీషా గారికి చెల్లింపబడవలసిన సర్కారు పైకమును ఖజానాలో జమకట్ట



బి. నరసింహ రావుగారు

ఐక్యరాజ్యసమితిలో భారత ప్రతినిధిగా ఉండి తరువాత అంతర్జాతీయ స్థానానికి జడ్జిగా ఎన్నికైనారు. నవంబరు 30-వ తేదీ ఉదయం స్వర్గస్థులైనారు.

## ★ కాలక్షేపం ★

లేదనే కారణంచేత కంచర్ల గోపన్న గారిని జెయిలులో పెట్టించి కొరడాలతో కొట్టించాడు తానీషా. భద్రాద్రిలో అమ్మవారికీ, స్వామివారికీ ఆయన చేయించిన ఆభరణములను తానీషా జప్తుచేయించి తెప్పించి అమ్మించినట్లయితే సర్కారుకు చెందవలసిన పైకం చాలావరకు వసూలువచ్చేది. మిగిలిన పైకమును అక్కన్న గారుగాని, మాదన్న గారుగాని జామీను ఉండి చెల్లించియుండవచ్చు. కాని, ఆ విధంగా ప్రత్యక్షంగా కన్పిస్తున్న చరాస్తినీ జవాహిరీనీ జప్తుచేయకుండా గోపన్న గారిని జెయిలులో పెట్టి బాధించడం చూస్తే, అక్కన్న మాదన్నల మేనల్లుడనే గౌరవంకూడా కంచర్ల గోపన్న గారి విషయంలో తానీషా చూపించినట్లుగా కన్పించదు. అపహరించిన సొమ్ముకోసం అంతటి శిక్ష విధించాడా? హిందూదేవాలయంకోసం అంతసొమ్ము వెచ్చింపబడినందుకై సహించక ఆ మహమ్మదీయ ప్రభువు ఆయనను హింసించాడా? హిందువులనే తన మంత్రులుగా ఏర్పాటు చేసికొన్నటువంటివాడు అంత అసహనం చూపించడం అసహజం, అవ్యక్తం, అక్రమం. ఏమైనప్పటికీ, సీతమ్మకు చేయించిన చింతాకు పతకమును తానీషా జప్తుచేయించి నట్లయితే, అది దేవుని ద్రవ్యాన్ని అపహరించినట్లవుతుంది. అందువల్ల భక్తుల ఆగ్రహం ఏ ఉగ్రరూపంలోకి వస్తుందో గోల్కొండ నవాబుకూడా ఊహించలేక, అట్టిపనికి తెగించలేక, ధైర్యం కోల్పోయినవాడైనాడు. దీనివల్ల బోధపడే విషయం ఒక్కటిఉంది.

గోపన్న గారు గొప్ప రామభక్తుడు. అటువంటి రామదాసుకు ఆ భద్రాచలం ఏజన్సీలోని అడవిజాతులవాళ్లందరూ భక్తులై ఆయనకు దాసోహం అన్నారు. అటువంటి వాళ్లు ఏంచేసినా చేస్తారు. ఆలయంవద్ద భజనలు చేస్తున్నది వాళ్లే. ఆలయం కట్టిస్తానంటే డబ్బు యిచ్చినది వాళ్లే. అమ్మవారికి ఆభరణాలు చేయిస్తానంటే డబ్బుయిచ్చినది వాళ్లే. బహుశః సర్కారుకు యివ్వవలసిన శిస్తు మొత్తాలు చెల్లించవలసినదిగా అడిగితే, ఈ ఏజన్సీవాళ్లు యివ్వకపోవచ్చు. అదివరకు ఎన్ని ఫసలీల శిస్తులు బకాయి పెట్టినారో ఎవరికి తెలుసు? బహుశః అటువంటి మొండి బేవనూలు బకాయి ఏజన్సీ తహసీలుకుయిా గోపన్న గారు తగిన తహసీల్దారు అన్నట్లుగా నియమించారేమో. అటువంటి ఎరుకల, యానాది, చెంచు, లంబాడీ ప్రాంతంలోని ప్రజలను మున్ముందుగా దైవభక్తులనుగా చేసి అటుపిమ్మట వారిని సన్మార్గులనుగా చేసి, అనంతరము ప్రభు భక్తి పరాయణులనుగా చేయడం సుసాధ్యం. ఇదంతా ఒక మిషనరీ చేసే ప్రచారం లాగున సాగించవలెననే ఉద్దేశ్యంతో రామదాసుగారు ఆలయ నిర్మాణం ముందుగా చేసియుండవచ్చు.

బ్రిటిష్ ప్రభుత్వకాలమందు కూడా ప్రజావశీకరణ వ్యవహారములో క్రయిస్తవ పాదిరీలను తమకు కుడిభుజములుగా బ్రిటిష్ ప్రభువులు ఏర్పాటు చేసికొన్నారు. ఈ క్రయిస్తవమిషనరీలు మనదేశంలోస్కూళ్ళు పెట్టించారు. ఆస్పత్రులు ఏర్పాటుచేశారు. బైబిలు పుస్తకాలు ఉచితంగా పంచిపెట్టించారు. మొట్టమొదట యీ క్రయిస్తవ మిషనరీ స్కూళ్ళల్లో చదువుకొనుటకై హిందు

(53-వ పేజీ చూడండి)




# సివిక్ సెన్సు

★

అయాచితుల హనుమచ్ఛాస్త్రి

అడుగడుగో, అడుగడుగో
తడబడుతూ, నిలబడుతూ
నిలబడుతూ, తడబడుతూ
తడబడి, నిలబడి
నిలబడి, తడబడి
అడుగడుగున
పడుతూ లేస్తూ
వస్తున్నాడు, ఇప్పటికి
పదిరోజుల నుండీ
వస్తున్నాడు, నేస్తం!
వంకరజీవితమా – కాదది –
చేతిలోని
కొంకెకర్ర
మోటిస్తూ, తాటిస్తూ
తడబడుతూ, నిలబడుతూ
వస్తున్నాడు, వస్తున్నాడు
ఠక్...ఠక్...ఠకాఠక్ ఠక్...
ఎక్కేగుమ్మం, దిగేగుమ్మం
సొమ్మసిల్లి పోతున్నాయి-ప్రాణాలు
ఎముకలగూటిలో
పిట్ట – గిజగిజా
కొట్టుకొంటోంది –
రాచబాట నడిబొడ్డుకు
వచ్చి ఆగింది
ఆ నరరూపకంకాళం
చేతిలోని కర్ర
చెయ్యి తప్పిపోయింది
తన హృదయంలా
పడి పగిలిపోయింది
ప్రపంచ ధర్మపు
కొలపాత్ర, చేతిలోని
భిక్షాపాత్ర!
కండ్ల అంచులకు వచ్చిన
కాంతులతోపాటు
కదలిపోయాయి
అతనిప్రాణాలు.

* *

'అబ్బే! అబ్బే! దారి
కడ్డంగా చచ్చిపోయాడు-'ఛేఫ్'
ఇతగాడిలో
సివిక్ సెన్స్
అణుమాత్రం లేదుపో
అందుకే ఇండియాప్రజలు
ఇంత అధ్వానంగాఉంటు!"
అన్నా రేకగ్రీవంగా
పదిగంటలకు, పదిలంగా
కచేరీలకు కదలిపోయే
ఆఫీసర్లందరూ.
కారు చక్రాలకు
అడ్డుతగిలి
కదలనన్నదికాబోలు
అతడిశరీరం.

పెద్దకథ

# వీరులూ–వారసులూ

శ్రీ మునిపల్లె రాజు

కోటిలింగం కావిడిపెట్టె మీదున్న ఏకులబుట్టలుదించి, పైకండువాతో పెట్టెమీద పరచుకొన్న దుమ్ము దులిపి, లోపలినుండి మడతలైనా మాయని పెద్దాపురం పట్టుత్తరీయం తీశాడు. ఆ జరీఅంచుల పట్టుత్తరీయం యిప్పటిదిగాదు. పెళ్ళినాటిది. పెళ్ళిమాత్రం యిప్పటిమాటా? పదహారేళ్ళయింది.

ఎప్పుడో వేసిన కలరావుండల వాసన గుమ్మునకొట్టె కోటిలింగం మళ్ళీ పెట్టె మూతవేశాడు. అందులో యీ పట్టుత్తరీయం ఒక్కటే విలువైనవస్తువు.

తాయారమ్మవచ్చి "ఎక్కడికి?" అని ప్రశ్నించింది.

కోటిలింగం భార్యముఖం చూడకుండా నే—"అదుగో, ఆమాటే అడగొద్దన్నా నిన్ను. అడక్కపోతే నేను చెప్పనూ? అదుగో నే హంసపాదు బెడతావు. తాలూకా పోతున్నాం—మన పేటవాళ్ళమంతా కలిసి. తాసీల్దారుదగ్గిరికి. సరేనా?" అని పుల్లవిరుపు సమాధానం యిచ్చాడు. అతని కళ్ళు లోతుగావున్నాయి. అంత పొడుగుగూడా ముఖం చిరుచెమటలు పోసి వున్నది.

"పిల్లది తుమ్మింది. కొంచెం తాళిపో. గంజి కాస్తున్నా. కాస్త తాగిపోతావా?"

కోటిలింగం మాట్లాడక కావిడిపెట్టె మీద కూచొన్నాడు. మరుక్షణంలోనే బయటనుండివచ్చిన నూలుసత్యం కేక విని తుర్రున లేచిపోయాడు.

చేతిలో ఆవిర్లువస్తున్న గంజిగిన్నె పట్టుకొని గడపలోనే ఆగిపోయింది తాయారమ్మ.

ఊరింకా నిద్రలేవలేదు. పనుల్లేని కాలమని తాపీగా విశ్రాంతి తీసుకొంటున్నది. సూర్యోదయమై అరగంటకూడా దాటలేదు. మిగతావాండ్లను పిలుస్తూ నూలు సత్యం వినాయకుడి సందులోకి వెళ్ళి యింకా రాలేదు.

ఈ సూర్యోదయానికి అర్థమేమిటి? నిత్యమూ, ఎల్లెడలా, ఖండ ఖండాంతరాల్లో, నదీ నదాల్లో, లోయల్లో, తోపుల్లో, కొండల్లో వుదయించే యీ తూర్పు కిరణాలు యివ్వాళ యింత ఎఱ్ఱగా ఎందుకున్నాయి? ప్రతిచోటా, ప్రతిదినమూ, ప్రతిజీవీ అనుభవించే ఉదయమూ, అస్తమయమూ–ఊరికంతకూ ఒక సామాన్య సంఘటనే గదా? కాని తనకు? కోటిలింగానికి? ముగ్గురు బిడ్డల తండ్రి కోటిలింగానికి? మాష్టరు వీవర్ అవుతానని పెళ్లినాటినుండీ ఆశల రహస్యపు కలల మెత్తటి పూలసెజ్జలమీద నిద్రించిన–చేనేత పనివాడు కోటిలింగానికి? చేనేత సంఘం రాకముందు "సాలెవాడు", మొదటి దశలో "పద్మశాలి" యిప్పుడు అందరు మోతుబరి రైతులవలెనే ఒక వ్యక్తియైన "కోటిలింగానికి"–యిది సామాన్య సంఘట నెట్లా అవుతుంది? పాడుబడి మూలనుండి దిక్కులేక, నోరులేక, నిశ్శబ్ద దేవతలాగా దుఃఖించే తన మగ్గం దృశ్యంగాదా యీ బాలసూర్యుడి లేతకిరణ పుంజాలు? వారం రోజులనుండీ బియ్యపు మెతుకెరగని తన భార్య కుంకుమబొట్టు ముఖంమీద అదృశ్యమై, దృశ్యమై, దోబూచులాడే దైన్యదేవతగాదా–యీ వుదయ తేజస్సు మేల్కొలుపు? తరతరాలనుండి నిలిచిన మగ్గపుయింట్లో పుట్టి, నిండు గుడ్డకు నోచుకోని తన ముగ్గురు బిడ్డలకు యీ భానుడి వుదయం కొత్తపగటి దుస్స్వప్నంవలె నిలుస్తుందని తనకు తెలియదా? తెలుసు, తెలుసు, కాలం మారింది, సూర్యుడు మారాడు, తను నేసిన ఖద్దరుపంచెలు మారినవి; తన రంగురంగుల చీరెల జిగి నగిషీలు మారినవి; జరీలు, కడుపులో జ్వాలలు, మానవులూ, మనసులో ఆశలూ, కండలూ, కంటిమీది కునుకూ–అన్నీ మారినవి. కాని యీ వుదయం నిలిచేవుంది. యిక అస్తమయమూ రాబోతుంది. యుగయుగాల ఆకలి నెత్తురు గుర్తులివి. ఉదయమూ, అస్తమయమూ, మానవుల ఆకలికి కొలమానాలివి. నూలు సత్యం కేకలు వినబడుతున్నవే గాని యింకా తిరిగిరాలేదు.

మూడుసార్లు కాంగ్రెసులో జైలుజీవితం అనుభవించి వచ్చిన శ్రీరాములుగారు చెలువుకట్ట దిగుతూ, కోటిలింగాన్ని చూసి దగ్గరికివచ్చాడు. శ్రీరాములుగారి ఆశీర్వచన బలంవల్లనే, యీ బక్క రాజకీయ బాధితుడి ప్రోద్బలంవల్లనే–చేనేత సంఘం మెమోరాండం తయారయింది. ముఠా రాజకీయవేత్తల ప్రాపుకు, మోతుబరిరైతు మిల్లుగార్ల మాపుకూ కొరగాని శ్రీరాములుగారి నిత్య దరిద్రనారాయణ వాతావరణపు చావులేని ఆశనుండే–యీ చేనేతకార్మికుల ఆకలియాత్ర తాసీల్దారును చూడబోతున్నది.

"నమస్కారమండీ, పంతులుగారూ!"

"శుభస్య శీఘ్రం" అని శ్రీరాములు నవ్వాడు.

"సత్యంకోసం చూస్తున్నాను. వాళ్లందర్నీ పిలవబోయాడు."

"సత్యం ఎదురవుతుంది. సత్యం జయించి తీరుతుంది కోటిలింగం."

"పెద్దలు. తమరెప్పుడూ యిట్లాగే అంటారు. మీ ఆశీర్వచనం."

"ఇదుగో మరిచిపోయ్యేరు గనక, బ్లాకు మార్కెట్టు చేస్తున్న మాష్టరు వీవర్ల సంగతి కూడా చెప్పండి మళ్ళీ నిన్న పేపర్లో 40వ నెంబరుకు కూడా ధర పెరిగిందని చదివాను. నే నిచ్చిన లిష్టున్నదా పోయిందా?"

"ఎంతమాటన్నారు? పోవటమా?"

పోదుపోదు; ఆకలి వున్నంతవరకూ, ఆశలు మిగిలినంతవరకూ పోదు.

నలభై ఏళ్లకే ముగ్గుబుట్టయిన తలతో నడిచిపోతున్న యీ సన్నని దేశభక్తుడు అసత్యంలో సత్యాన్ని, హింసలో అహింసను చూడగలడు. అన్యాయంలోనుంచే న్యాయం ఉద్భవిస్తుందంటాడు.

సత్యం ఎదురుగాదా? ఈనాటికి తన ఆకలి సత్యం. ఈక్షణాన తన ఆశలు సత్యం. ఈ ఘడియన వుదయం సత్యం. ఏమో, ఎవరుచూశారు? ఆయనకు, ఏ అన్యాయం చేయని ఆయనకు, ఎన్నడూ అబద్ధమాడని ఆయనకు, ఆయనకు తెలీదా? తన క్షుద్బా

థలో నుండీ రామరాజ్యమే రాగూడదా? ఎందుకు రాగూడదు?

* * *

చెన్నకేశవస్వామి దేవాలయపు అరుగుల మీద అప్పటికప్పుడే సాంబయ్యా హోటల్లో తిని త్రాగి, త్రేన్చివచ్చిన పెద్దమనుషులు చేరారు. గుడి మంటపం వెనక పాతగదుల్లో వుంటున్న రామానుజయ్యాగూడా తంబుర మీద పాటలుబాడి ముగించి కాషాయ లుంగీ చుట్టుకొని బయటకు వచ్చాడు. రామానుజయ్యా కోటిలింగం గురువు.

"వెళ్ళొస్తాం తాతా" అని ముందుకొచ్చి, నిలబడ్డాడు కోటిలింగం.

సగంబోసి నోరువిప్పి కన్నడపు తెలుగులో "నేనూ భద్రాద్రి బోతున్నాగదా?" అన్నాడు రామానుజయ్యా.

"మేము రేపేవస్తాం. నువ్వెళ్ళేది వచ్చేవారమేగా."

"కాదులే. నడిచివెళ్దామని అనుకొన్నా. నువ్వంటే రేపే బయలుదేరుదును. నువ్వొచ్చిందాకా వుంటానులే."

"మరి వెళ్ళిరమ్మంటావా?"

"సద్గురు కటాక్షం."

అందరికన్నా వెనకనడిచాడు గుంపులో కోటిలింగం. సత్యం అడిగాడు—"పెళ్ళికొడుకు దిరుసు బనాయించినావే?" అని నవ్వుతూ. ఆ మాట నిజమే. కోటలింగం యీ పట్టు త్తరీయం పట్టుమని పదిసార్లు గూడా వేసుకోలేదు తన పెళ్ళికి, తర్వాత సత్యం పెళ్ళికి, మళ్ళీ చేనేత సంఘం మొదటిమీటింగునాడూ, తిరిగి యిప్పుడు. ఈ కండువా చూస్తే కోటలింగానికి ఆకలి పోతుంది; ఆశలు పుట్టుకొస్తయ్. నాసరు పీవర్ భుజంమీద వుండవలసిన వుత్తరీయం, చేనేత కార్మికుడి చిరిగిన బనీను వీపు కప్పుతున్నది. ఆకలినుండి ఆశకు.



తాలూకా పోతున్నాం - మనపేట వాళ్లమంతా కలిసి తాసీల్దారు దగ్గరికి-సరేనా.

## 2

తాలూకా యాత్రకు కొండంత ఆశతో వెళ్ళారు అంతా. ముఖ్యంగా కోటిలింగం. ఆకలియాత్ర నడక మీదనే సాగింది. దాదాపు నలభైమైళ్ళు. దారిలో కోటిలింగం ఎవరితోనూ మాట్లాడలేదు. అందరూ చదిమూటలు తెచ్చుకొని, మధ్యలో మామిడాదగ్గరో, పుల్లవెట్టుకిందనో తినేశారు. కొందరు జెండాలు పట్టుకొన్నారు. సత్యం వంటి కుర్రవాళ్ళు పాటలుపాడారు. ఆకలి వుండదనీ, ఆహారం తర్వాత సుఖముఖ్యమనీ, గుడ్డనేసేవాడికి తిండిపెట్టమనీ, మంచిరోజులొస్తాయనీ, మగ్గాలు మారుపలుకుతాయని యీ మానవుల పాటలు. కోటిలింగం శ్రద్ధగా విన్నాడుగాని వాళ్ళతో గొంతు కలపలేదు. మూగనోము పట్టిన గృహస్థువలె నడిచాడు. దాహమైనచోట నీళ్ళుతాగాడు. అతని హృదయంలో రామానుజయ్యా మెదిలాడు. అతని మనస్సులో శ్రీరాములు కదిలాడు. అతని తలపుల్లో తాయారమ్మ తొరట్లాడింది. పొద్దున్నే ఎందుకుతిట్టాడు. పిచ్చి తాయారు? ఏమన్నదని?

పరిణతి చెందిన ఆశ ఆకారం ధరించినట్లున్నాడు కోటిలింగం. ఎవరితోనో మాట్లాడి యీ దివ్యస్వరూపాన్ని చెడగొట్టడమా? ఒక్కమాటతో, వృధా నవ్వుతో, ఒక్క నాలిక కదలికతో, రామానుజయ్యా సద్గురు కటాక్షం, శ్రీరాములుగారి సత్యస్వరూప సాక్షాత్కారం, తన ఊహల రామరాజ్యం మాయమై, తిరిగి కనబడక, ఈఅనంతయాత్ర వలెనే తిప్పలు పెట్టి, వెతల్లో చీకటిలో, ఆకలిలో ముంచి పోతేనో! ఈ మానం యీ తపస్సు, యీ ధ్యానమహిమ వీళ్ళకు తెలియదు. తను వీరిలో చేరలేడు. వాళ్ళ ఆకలిని తను పంచుకోగలడు; కాని తన వేదాంతాన్ని వీళ్లో?

తాలూకా వస్తుంది; గలువు యిసిక; దానితో తహశీలుదారు; తను మెమోరాండం; కోర్కెలు; హక్కులు; విన్నపాలు. మళ్ళీ తన నూలుకట పాతధరలకు దొరుకు

తుంది. బజారులో తన చీరెలధరలు తిరిగి నిలుస్తవి. తిరిగి బియ్యం కొనవచ్చు. మళ్ళీ బ్లాకుమార్కెటీర్ల యింటిచుట్టూ తిరిగి కాళ్ళు పట్టుకొనకుండానే తనకు మాష్టర్ జీవరు పద్దులిస్తాడు. తన మగ్గం తాకట్టుపోతుంది. తన మగ్గం మారుపలికి మాట్లాడి, పాటపాడి, పిల్లల పొట్టనింపుతుంది. పశువులు మేసేందుకు, మేకలు పోసేందుకు - తను మాణిక్యాన్ని, చెంగమ్మను మళ్ళీపిలిచి పనిచూపిస్తాడు. దేవుడు మేలుచేస్తే, వచ్చేయేడు తనుగూడా భద్రాద్రియాత్ర చెయ్యబోతాడు రామానుజయ్యతోపాటు. పెద్దవాడికి వడుగు పోగు వేసి, కందికట్ల శ్రీరాములు పంతులుగారికి, (ఆ పేదబ్రాహ్మణ్ని పిలిచి) తాంబూలం యిప్పించి, పిల్లవాడిచేత పంచలచాపు గూడా పెట్టించాలి.

కళ్ళు తెరిచాడా - యీ స్వప్నం నశించవచ్చు. నోరు కదిపాడా - యీ స్వర్లోకం నుంచి భూలోకానికి పతనమైపోవచ్చు. తను చూడడు. తను మాటాడడు. తనది ఆకలి. తనది ఆశ. తనది స్వప్నం.



తాసీల్దారు రెండుగంటలైనా బంగళానుండి బయటకురాలేదు. యాత్రికులందరూ జీడి మామిడి చెట్లక్రింద బైఠాయించారు. ఎండ మలమల మాడ్చుతున్నది. ఇసుకనేల కొలిమిలో ఇనుమువలె కాలిపోతున్నది. కాని తాసీల్దార్ రాలేదు.

యన్. జి. వోల సమ్మెలో తమకు జీతం ఎక్కువ కావాలని, తమ బిడ్డల చదువుకు రక్షణ కావాలని, తమకు వుచితవైద్య సౌకర్యాలు అమరాలని కోరిన యీ తాసీల్దారును - యీ ఆకలి యాత్ర ఎందుకు కదల్చలేదో! నాలుగు డబ్బులు కూడబెట్టుకొని గ్రామస్థుల సౌఖ్యాన్ని దగ్ధంచేసే ముఠావాది రైతు మోతుబరివలె, నాలుగు మిడిమిడి యింగ్లీషు ముక్కలు చదివి చేయవలసిన తన ప్రజాసేవను మరిచిపోయే యీ చిన్న అధికారి గూడా - యీ దేశంలో దైవాంశ సంభూతుడే. గ్రామోద్యోగులు, తనవలె, ఎక్కువ జీతం కావాలని కోరినప్పుడు, వాళ్ళందరూ కుట్రదారులని రిపోర్టుచేసిన అధికారే చివరకు సత్యం యింకా నలుగురు చదువుకొన్న వాళ్లు ముందుకువచ్చి ఇచ్చిన మెమోరాండాన్ని చూచాడు. నిశ్శబ్దంగా నుంచొని తన కడుపులోని పేగుల దీనారావాన్ని నిర్లక్ష్యంచేసి, తను మనిషిగాక మాకైనట్లు నిలబడి కోటిలింగం - యీ వర్తమాన దృశ్యాన్ని చూడలేదు. సత్యం ధైర్యంగా గబగబా తమ కోర్కెల్ని వల్లించాడు. ఫలాని ఫలాలివాళ్ళు నూలులో బ్లాకు మార్కెటు చేస్తున్నారని, వచ్చి విచారించమని అంతమంది ముందూ కోరాడు. దేశనాయకులు పేటకువచ్చిన బ్రిటిష్‌రోజుల్లో అంతమంది పోలీసుల ముందు తను వడికిన ఖద్దరు నూలుదండల్ని వాళ్ళ మెడల్లో గర్వంలో, ధైర్యంతో, సంతోషంతో వేసిన ఆ కోటిలింగమే తన మౌనవ్రతాన్ని తనే భంగపరచలేక నిస్సహాయుడై అక్కడ యీనాడు ఆ క్షణంలో గూడా నిలిచాడు. కొందరు నినాదాలు చేశారు. కొందరు తమ సంగతులు గూడా వినిపించటానికి ముందుకు దూకారు. కొందరు పోలీసుల వంక చూస్తూ నిల్చుండిపోయారు.

తాసీల్దారు అంతా విన్నాడు. "మీ కాయితం పైకి పంపుతా" నన్నాడు. గంజికేంద్రం సంగతిగూడా రాస్తానన్నాడు. తన చేతిలో ఏమీలేదన్నాడు. "ఏమీ లేదా?" అన్న ప్రశ్న బరువై కోటిలింగం మనస్సులో పదిసార్లు మారుమ్రోగింది. కాని కోటిలింగం కదలలేదు. తాసీల్దారు పెదిమలవంక చూసి ప్రార్థనాభావంతో కళ్లు మూసుకొన్నాడు.

## 3

"తపస్సు ముగిసింది. ఇక దేవుని వరం కోసం వేచివున్నా న"న్నట్లయినది ఆకలి యాత్ర ముగింపు. బాపట్లనుంచి తిరిగి వస్తూనే కోటిలింగం రామానుజయ్య మఠం ముందు ఆగిపోయాడు. అతను ఆకలి సంగతే మరచిపోయాడు. సత్యం బలవంతంమీద నిన్న తిన్న యిడ్లెన్ను, కాఫీమాత్రమే రెండురోజుల ఆహారం.

రామానుజయ్య ఆముదపు ప్రమిదె వెలిగించి - "నా ప్రయాణం ఆగిపోయింది. వచ్చేవారమే వెళ్తాను. నడిచి కాదు. రైలుబండి" అన్నాడు కోటిలింగం వంకతిరిగి. రామానుజయ్య ఎప్పుడూ కోటిలింగం దారిద్ర్యస్థితినిగురించి ప్రస్తావించడు, ప్రస్తావించలేదు.

వడదెబ్బకు, ఎర్రదుమ్ముకు, నిన్నటినుండి వుపాసిస్తున్న మౌనముద్రకు జేగురుబడి వింతవెలుగుతో కప్పుకొన్న తన ముఖాన్ని, అక్కడి ముంతనీళ్ళతో కడుగుకొని, కోటిలింగం నడుముకు కట్టుకొన్న కొల్లాయిగుడ్డతో తుడుచుకుంటూ—

"అదేమిటి తాతా! నేను రాగానే వెళ్ళతానంటివి?" అని మా రామానుజయ్య కళ్లల్లోకి ఆశ్చర్యంగా చూశాడు.

తాత బుర్రమీద ముసుగు తొలగించుకొని, ఒక్కక్షణం మాట్లాడక శిష్యుడివంకనే కళ్ళునిలిపి ఆవులించినాడు. ఆ ఏకక్షణపు నిశ్శబ్దం ఆగి కాలాలనుండి, అనాది యుగాలనుండి, అనంతమై, అఖండమై, నిర్విరామమై సాగిన మహా మౌనముద్రగా, భయంకర వేదనతో, రహస్యగర్భితమై కోటిలింగానికి కనబడ్డది.

"తా...తా!" అన్న అతని పెదిమల వణకుకు ప్రమిదె కొండెక్కినది.

ఎవరిముందు తానుకూర్చున్నది? ఎవరీ తాత? కన్నడపుయాసతో తెలుగుమాట్లాడే యీ రామానుజయ్య ఎవరు? యోగివేమన అవతారమా? వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన దివ్యదీపికా? కబీర్ దాసుడా? సిద్ధుడా? జీవసమాధిపొందిన మహాయోగిపుంగవుడా? ఎవరీ రహస్యవాది? ఏమిటీ ఆది అంతూలేని మౌనముద్ర? కోటిలింగం అప్రయత్నంగా చేతులుజోడించినాడు. అతని ఫాలభాగం పై ముచ్చెమటలు పోసినవి. ఆ చీకటిలోనే ఆరిపోయిన ప్రమిదెనుండి, కొరిడికట్టిన వత్తినుండి రహస్యవాసనవచ్చినది. మెల్లగా భయంతో ఆ అవ్యక్త తమస్సులో దానినే ఆఘ్రాణించి వేచివున్నాడు కోటిలింగం.

(53 వ పేజీ చూడుడు)

# ఆశాపాశం

## జయంతి రామారావు

"సరిగ్గా తొమ్మిదిన్నరవఅకూ చూసి, వచ్చినా రాకపోయినా బయల్దేరి పోతాను." అని నిశ్చయించుకుని చిన్న మార్కెట్టుదగ్గర నిల్చున్నాను.

తొమ్మిదీ యిరవైఐంది.

"ఇంక మరో పదినిమిషాలే నిల్చోడం." హెచ్చరించుకున్నా, రిస్టువాచీతో చెప్తూన్నట్టు. సెకండ్ల ముల్లు చకచకా తన పని చేసుకుపోతోంది.

తొమ్మిదీ యిరవైఐదు. ఎక్కడా పత్తాలేదు. ఉండబట్టక రోడ్డుమధ్య కెళ్లిమూశా, ఏమూలనుంచైనా రావడమంటూ కనిపిస్తుందేమో నని.

"అబ్బే, కనుచూపుమేరలో అటువంటి శకునమేదీలేదు." ఇంతల్లో గణగణమని, బ్రేకుల్లేవు కాబోలాకశే బెల్లు కొడుతూ మీదికి వచ్చేస్తున్నాడు సైకిలు రిక్షావాడు. గభాల్న తప్పుకున్నాను. లేకపోతే యీపాటికి కే. జి. హెచ్‌లో ఉండేవాణ్ణే. నేనింకా ఏదో అందామనుకుంటూండగానే

"ఎంత గంటకొట్టినా కదలేటండీ? ఇనిపించటంలేదా?" అంటూ నామీదే తిరగబడ్డం మొదలెట్టాడు. తప్పు మనలోనే ఉంచెకెంవల్ల వాణ్ణేమీ అనలేక,

"అయినా హిడింబి అమ్మమ్మల్లాగున్న యీ రిక్షాలకి ఎంత వెడల్పైన రోడ్డూ చాలదు." అని నలుగురూ వినేటట్టు గట్టిగా వాడినో నాలుగు తిట్టేసి, రోడ్డుపక్కకి చేరుకున్నా.

వాచీ చూసుకుంటే తొమ్మిదీ యిరవైయేడూ.

"ఏడవమను. ఎప్పటికీ రాకపోతే ఎంతసేపని చూస్తాం." చిరాకెత్తుతోంది. దానికి తోడు ఎండలో నిలబడ్డంవల్ల చెమటపోసి మహా చికాగ్గాఉంది. మొహమంతా రుమాల్తో తుడుచుకొంటున్నానుగాని, బుద్ధి గడ్డితిని వేసుకున్న కొత్త బనీనుచేత వీపంతా చిటపటలాడుతూ మీద నోముళ్ళుపాద వేసుకున్నట్లుంది.

"పోనీ వచ్చేదీ రాందీ దూరంనించేనా కనిపిస్తుందేమో అంటే వెధవ వ్యాంక రోకటీ, రోడ్డు కిక్కడ." ఎదురుగా నాకదే కనబడింది. "మాడగా అష్టావక్రుడెవడో వేసినట్లున్నాడు దీన్ని. కుక్కతోకలా కాకపోతే కాస్త తిన్నగా వెయ్యకూడదూ చేతకాని వెధవ" అని వాణ్ణో నాలుగు పూజ చేసేను.

నా అర్థంలేని చిరాకుమీద నాకే కోపం వచ్చింది.

నా దౌర్భాగ్యవశంచేత సిటీబస్సు రాకపోతే మధ్య నీ రోడ్డునీ, రోడ్డు వేసిన వాణ్ణీ తిట్టడమేమిటి? అసందర్భం. అయినా యీమాత్రం మనోనిగ్రహం లేకపోతే మానవజన్మ ఎత్తి ఏం లాభం? అసలీ మాట పట్టుదలా లేకపోబట్టే యింతకాలం అనుభవించేను. అందవలసిన నాడు తొందరబడిపోయి యింక మరి వచ్చేదేమిటని బయల్దేరిపోవడమూ, నేనూ నాలుగడుగులు వేసేసరికి బుర్రుమంటూ బస్సు నాపక్కనుంచి వెళ్లిపోవడము శపించినట్టు జరిగేది. అసలు నే రావడానికో పావుగంట ముందుగానే బస్సు వెళ్లిపోయిన రోజున, యింకా వస్తుందేమో అన్న భ్రమతో ఓ అరగంట సేపెక్కువ చూసేవాణ్ణి. ఆఖరుకి, మరో యింత ఆలస్యమయిపోవడమే జరిగేది. అంచేత యీమారు వచ్చే సూచనయినా లేకపోయినా, తొమ్మిదిన్నరవఅకూ చూసి, తొమ్మిదిన్నర అయింతర్వాత యింద్రుడు వచ్చి చెప్పినా ఆగకుండా వెళ్ళిపోదామనే వజ్రసంకల్పంతో యింటినుంచి బయల్దేరాను. కాబట్టి ఇవాళ

(52-వ పేజీ చూడండి)

# తోటికోడలు

**"శ్రీ రాగి"**

పున్నయ్య సాయంకాలం అయిదింటికి ఆఫీసు అయిపోగానే ఇంటికి వచ్చాడు.

అతను ఇంటికి వచ్చేటప్పటికి, ఇంట్లో రామరావణ యుద్ధం జరుగుతున్నది, ఇంటి ఆడవాళ్ళకీ, తన శ్రీమతికీ మధ్య.

పున్నయ్యకు ఇంటావిడ మండుతున్న అగ్నిగోళంలా కనుపించింది. మరి మండుతున్న అగ్నిగోళంవైపు, పున్నయ్య తన దృష్టులను ఎలా సారించగలడు?

ఇంటావిడ వాదులాడే భంగిమ చూసిన తర్వాత పున్నయ్య కాశ్మీరు సమస్య విషయంమీద వాదించడానికి భారత ప్రభుత్వ మావిడను మిత్రరాజ్య సమితికి ఎందుకు పంపించదా, అని తలపోశాడు.

పున్నయ్య ఆ ఇంట్లో ప్రవేశించి సంవత్సరన్నర అయింది. మొటమొదట ఆ రెండు కుటుంబాలమధ్య పేచీలేమీ లేకుండానే సవ్యంగా జరిగిపోయింది. వాళ్ళింట్లో వీళ్ళూ, వీళ్ళింట్లో వాళ్ళూ భోజనాలు చేస్తూవుండేవారు. అప్పుడప్పుడు జరుగుతుండే చిన్న చిన్న గృహోత్సవాలలో చిన్న చిన్న కట్నాలు ఇచ్చిపుచ్చుకోడాలు జరుగుతుండేవి.

అయిదారు నెలల క్రిందట ఆ ఇంటి యజమాని చనిపోయ్యాడు. ఆయన ఇద్దరి కొడుకులూ ఆస్తీ ఇల్లూ పంచుకొన్నారు. ఆ ఇంట్లో మొత్తం మూడుభాగాలు. పెద్ద కొడుకు నాగేశ్వరరావు కొక పెద్దభాగమూ, చిన్న కొడుకు సుబ్బారావుకు రెండు చిన్న భాగాలూ వచ్చినయి.

పున్నయ్య వుంటున్న భాగం సుబ్బారావుకు వచ్చింది. నాగేశ్వరరావుకు ముగ్గురు మగపిల్లలున్నారు. వాళ్లు మహా తుంటరిపిల్లలు. పున్నయ్య ప్రతినెలా ఇరవై రూపాయలు అద్దె ముద్ర శుద్ధిగా చెల్లించేవాడు.

అన్నదమ్ములు విడిపోయిన తర్వాత పున్నయ్య, అద్దె సుబ్బారావుకే చెల్లిస్తుండేవాడు.

ఆ అద్దెతో తన కేమీ సంబంధం లేకపోయినా, నాగేశ్వరరావుభార్య చంద్రమ్మకు, ఎందుకో అకారణంగా తోటికోడలి కుటుంబంమీద అసూయ కలిగింది. అది సాకుగా పున్నయ్య కుటుంబాన్ని ఏదో నెపంతో అనరాని మాట లంటుండేది. పున్నయ్య భార్య ఇందిర చాలావరకు ఓర్పుతో నెట్టుకుంటూ వచ్చింది.

ఆరోజున పున్నయ్య కొడుకు నారాయణ జుట్టు చంద్రమ్మ కొడుకు చిన్న కత్తెరతో కొద్దిగా కత్తిరించాడు.

నారాయణ ఏడుస్తూ తల్లిదగ్గర కొచ్చి-

"అమ్మ చూడవే, వాళ్ల రాముడు, నా జుట్టు ఎలా కత్తిరించాడో!" అంటూ ఫిర్యాదు చేశాడు.

కత్తిరించబడిన జుట్టు చూసేసరికి అటువంటి తుంటరిపిల్లడి తల్లి అయిన చంద్రమ్మ మీద ఇందిరకు కోప మొచ్చింది.

అదివరకు ఇలానే రెండు మూడుసార్లు చంద్రమ్మ కొడుకు రాముం నారాయణని కొట్టాడు. కాని ఇందిర తొందరపడే స్వభావం కలది కాదు కనుక అప్పటికి ఊరుకొంది. ఆ సందర్భాలలో చంద్రమ్మ తన కొడుకు నారాయణని కోపపడినట్లు ఎక్కడా కనపడదు.

తన కొడుకు చేష్టలు తెలిసికూడా మందలించని చంద్రమ్మమీద, ఇందిరకు మనస్సులో కుట్రగానే వుంది.

ఇందిర నారాయణను తీసుకొని చంద్రమ్మ దగ్గర కెళ్ళి "చూశావుటమ్మ మీ కొడుకు ఏం చేశాడో?" అంది.

చంద్రమ్మ ఒక్క తీక్షణమైన చూపు ఇందిర వేపు విసిరి—"ఆఁ. ఏం చేశాడు మా అబ్బాయి?" అంది.

"చెయ్యాల్సిందే చేశాడు. మా అబ్బాయి జుట్టు కత్తిరించాడు. ఇటు చూడండే వెనకాల ఎలా కత్తిరించాడో."

"మా అబ్బాయే కత్తిరించాడని యేమిటి సాక్ష్యం?"

"దీనికి సాక్ష్యాలు కావాలా? ఈ చుట్టు ప్రక్కల మీవాడికన్నా తుంటరి ఎవరున్నారు?"

"ఏమమ్మాయి. మీ అబ్బాయి మహా బుద్ధిమంతుడన్నట్టు మాట్లాడుతున్నావు?" స్థాయి హెచ్చించింది చంద్రమ్మ.

"అవును మావాడు బుద్ధిమంతుడే."

"అందరు తల్లులూ అలాగే అనుకొంటారు."

"మీవాడి బుద్ధి ఈ చుట్టుప్రక్కల అందరికీ తెలుసు!"

"ఏమమ్మాయి, మా ఇంట్లో వుంటూ, మమ్మల్ని అనవసరంగా మాటలంటే పడేదాన్ని కాను"

"నేనేం అనవసరంగా అంట్లా. మీ అబ్బాయి మావాడి జుట్టు కత్తిరించాడు. పిలిచి బుద్ధిచెప్పండీ, అంటున్నాను"

"మావాడు కత్తిరించలేదంటుంటే ఏమిటీ వితండవాదం? అయినా మీవాడిని మావాడిదగ్గరికి రాకుండా చేసుకోరాదూ, వాడిమీదపడి ఇదవకపోతే?"

"అయితే పిల్లలూ, పిల్లలూ ఆడుకోనేది పోయి ఇటువంటి పిచ్చిపనులు చేస్తే ఎలా? ఇంతకి మీవాణ్ణి అదుపులో పెట్టారా లేదా?

"నీ పిల్లాణ్ణి అదుపులో పెట్టుకోలేక నన్నంటావేమమ్మ?"

ఈ పోట్లాట క్రమంగా పెద్దదైపోయి అనేక విషయాలు ఆ వాగ్వాదంలో దొర్లి

## "కాపిటల్లిస్టు"

శాశ్వత 'తాత్కాలిక రాజధాని'—కర్నూలు

తాత్కాలిక 'శాశ్వత రాజధాని'—విశాఖపట్నం

'శాశ్వత రాజధాని'— విజయవాడ-గుంటూరు.

శాశ్వత 'అశాశ్వత రాజధాని'—హైదరాబాదు.

నయి. చివరకు చంద్రమ్మ పెద్దగొంతుతో పున్నయ్యా కుటుంబంగురించి చాలా నిరసనగా మాట్లాడింది.

"ఇంతమంది ఈ ఇంట్లో ఉండివెళ్లారు, కాని ఇటువంటి దౌర్భాగ్యుల నెక్కడా చూడలేదు"

"ఇల్లు మీదిగదా అని నానామాటలంటే పడేవాళ్లెవరూ లేరిక్కడ. అనేకమంది ఇంటివాళ్లను చూశాముగాని, ఇంత గయ్యాళి మనుష్యుల నెక్కడా చూడలేదు"

"ఇల్లంతా నాశనం చేశారు. గచ్చు అంతా పగలకొట్టారు. తలుపు లిరగ్గొట్టారు. వీళ్ళిచ్చే ముష్టి అద్దె సంవత్సరానిది ఖర్చు పెట్టినా మళ్ళీ ఇంటికి రూపం రాదు. ఇల్లంతా దెయ్యాలకొంప చేశారు."

"శిథిలావస్థలోఉన్న ఈ ఇంట్లోచేరడం మాదే బుద్ధితక్కువ. ఈ కొంపకోసం ప్రతీ నెల ఇరవై రూపాయలు పోస్తున్నాము."

"అంత పీడగావుంటే ఖాళీచేసి లేచిపోరాదూ?"

"ఖాళీచెయ్యక ఇక్కడ మేమేం పాతుకుపోతా మనుకోటంలేదు. ఈమాదిరి కొంప ఇంత వూళ్లో మాకు దొరక్కపోదు."

"మీలాంటివాళ్లు ఎంతో అదృష్టంచేస్తే కాని దొరకరు."

"అసలు ఇల్లు మీ మరిదిగారిదయితే మీ పెత్తన మేమిటి మన్యా?"

"మా మరిదిదయితే మాది కాదూ? అన్నదమ్ములు బావుంటం నీ కిష్టంలేక తగూ పెడదామని చూస్తున్నావా?"

చంద్రమ్మ తోడికోడలు ఇంట్లో పని చేసుకొంటూ వీళ్ళ పోట్లాటలో జోక్యం కల్పించుకోలేదు.

పున్నయ్యా వచ్చిన తర్వాత కాసేపు ఆగి చూశాడు; చంద్రమ్మ తన ధోరణి బందు చేస్తుందేమోనని - కాని చంద్రమ్మ ఊరుకుంటేగా?

పున్నయ్యా జోక్యం కలిగించుకొని ఇలా అన్నాడు: "పిన్నిగారూ, మీరు ఇల్లుగల వాళ్ళుంగదా అని యేమేమో నోరుజారి మాట్లాడటం బాగుండదు. కొంచెం జాగ్రత్తగా మాట్లాడటం మంచిది."

పున్నయ్యా మాటలు విన్న చంద్రమ్మ తారాపథానికి లేచింది. "అమ్మో రాత! మగాడు ఆడదానిమీద పోట్లాటకి బయలుదేరాడు, ఆడంగి రేకులాగా!" అంటూ అరవటం మొదలు పెట్టింది.

కలహం ఆరంభమైనప్పటినుంచీ సుబ్బారావు ఇంట్లోనే వున్నాడు. కాని నోరు మెదపలేదు.

పున్నయ్యా, ఇందిరను జవాబు చెప్పొద్దన్నాడు, చంద్రమ్మ ఎంత అరుచుకొన్నా.

ఆ తర్వాత పున్నయ్యా కుటుంబంమీద చంద్రమ్మ, కొన్ని ఆంక్షలు విధించింది.

పున్నయ్యా ఇంటికి ఒకరిద్దరు చుట్టాలొచ్చి రెండుమూడు రోజులుంటే - చంద్రమ్మ.

"రోజ్జున పోయేవాళ్లంతా వచ్చి ఇల్లు పాడుచేస్తున్నారు" అని సాధించేది పున్నయ్యకి, వాళ్లకు వినపడేలాగ.

ఇంక వేసవికాలంలో మంచినీళ్ల బావి దగ్గర నీళ్ళు తెచ్చుకొంటుంటే, రోజూ ఇందిరమ్మ ఎన్నిబిందెలు తెచ్చుకొన్నదీ లెక్కగట్టేది.

తోటికోడలికి చంద్రమ్మ ఒక ఆలోచన చెప్పింది. పున్నయ్యాను ఖాళీచేయిస్తే, ఇళ్ళకరువును బట్టి ఈ రోజుల్లో ఆ ఇంటికే ముప్ఫయి రూపాయల అద్దె తేలికగా సంపాదించే అవకాశం లేకపోలేదని. సుబ్బారావు భార్యకు చెవి నిల్లు గట్టుకొని బోధించింది. చంద్రమ్మ మాటలు వినగా, వినగా, సుబ్బారావు దంపతులకు కూడా, పది రూపాయలు ఎక్కువగా వచ్చే అవకాశముంటే ఎందుకు వదులుకోవా లనిపించింది.

ఒక రోజున చంద్రమ్మ ఇంట్లో కాశీ సమారాధన జరుగుతున్నది. చంద్రమ్మ భర్తను పిలిచి పున్నయ్యాను భోజనానికి పిలవమంది. ఒకవేళ పున్నయ్యా భోజనానికి వస్తే అంతా అయిపోయిన తర్వాత, ఎప్పుడో అదను దొరికినప్పుడు—'మా ఇంట్లో వుంటూనే, భోజనాలు చేస్తూనే, మామీద పోట్లాడతారు. వాళ్లకు సిగ్గా, శరమా?' అని సాధించచ్చు. భోజనానికి రాకపోతే, ఇంట్లోనే వుండి ఇష్టం లేక, భోజనానికి రాలేదని సాధించవచ్చు. అంత భోజనం చేయటమే ఇష్టం లేనివాళ్ళు వాళ్ళింట్లో వుండట మెందుకని సాధించవచ్చు' అని ఆమె అనుకొంది.

కాని పున్నయ్యా కూడా సామాన్యుడు గాడు.

"ఈ కాశీ సమారాధన సంగతి, వాళ్ళు భోజనానికి పిలవబోయే సంగతి ముందుగానే ఊహించి, పెద్ద అర్జంటుపని ఉన్న వాడు లాగా పరాయి వూరు ప్రయాణం తలపెట్టాడు.

నాగేశ్వరరావు పున్నయ్యాని భోజనానికి పిలవటమూ జరిగింది, పున్నయ్యా తెపయాణం మిషమీద, రానని చెప్పి ప్పించుకోటమూ జరిగింది. దీనితో చంద్రమ్మ వేసిన ఎత్తు పారలేదు.

(52-వ పేజీ చూడండి)




## 16

పారిస్ ప్రధాన న్యాయమూర్తి రాబర్ట్ ఎస్టూటెవిల్ చాల ఐశ్వర్యం చేసుకుని పుణ్యాత్ముడని చెప్పాలి. మన కథా కాలం నాటికి ఆయన అధికారం రాబడీకూడా అపారం. ఆ పదవిలో చేయవలసిన పనికంటె అధికార దర్పం అధికం. అప్పటికి పదహారేళ్ళనించి ఆయన ఆ పదవిలో ఉంటున్నాడు. ఈ పదహారేళ్ళలోనూ ఎంతమంది మంత్రులో, ఉన్నతాధికారులో మారారు. ఉన్నతపదవుల్లో ఎంతమందో మారిపోయారు కాని రాబర్ట్ అధికారానికి చలనం రాలేదు. ఇంతేకాదు. తన తరవాత ఆ పదవి తన కుమారునికి సంక్రమించే ఏర్పాటుకూడా చేసుకున్నాడు. ఆయనకి పెద్ద జీతం వస్తుంది. ఇతరత్రా పెద్ద రాబడిఉంది. ఇదిగాక ఆడంబరంతో తళతళలాడే దుస్తులు ధరించి పెద్ద ఊరేగింపుల్లో గుర్రమెక్కి ముందు దారితీస్తాడు. పారిస్‌లోని జైళ్ళన్నిటిమీదా అధికారం ఆయనదే. అడుగడుగునా ఆయనకు ప్రణమిల్లి ఆజ్ఞలు శిరసావహించే ఉద్యోగులనేకమంది ఆయన అధీనంలో ఉన్నారు. పారిస్‌లో నేరస్థుల్ని విచారించి శిక్షిస్తాడు; ఉరి విధిస్తాడు, హింసించడానికి ఆజ్ఞలిస్తాడు. రాజుగారు స్వయంగా శిక్షలు విధించిన ముద్దాయిలుకూడా ఆయన చేతులమీదుగానే ఉరిస్తంభాలకు వెళ్ళాలి. ఇంక ఇంతకంటె ఏంకావాలి మనిషికి? కొన్ని పెద్ద తలకాయలుకూడా, అంటే రాజవంశస్థులు, ధనాఢ్యులు కొందరి తలలు రాబర్ట్ హయాంలోనే ఎగిరిపోయాయి.

సంపూర్ణమైన సంతృప్తితో రోజురోజూ జీవితం వెళ్ళబుచ్చడానికి ఏంకావాలి? అయినా ఆరోజుని, అంటే 1482 వ సంవత్సరం జనవరి 7 వ తేదీ ఉదయం రాబర్ట్ ఎందుకో అతిచికాగ్గా ఉన్నాడు. చికాకెందుకు కలిగిందో అతనికే తెలియదు. ఆరోజు మబ్బుపట్టలేదు. ఆయన పాతపటకా మరీ బిగిసిందేమో? తన్ని చూసికూడా తలవొంచుకోకుండా బికారులెవరైనా తిరస్కారభావంతో తలెగరవేసి వెళ్ళిపోయుంటారు. ఏమో! ఇటువంటివన్నా కారణాలుండవచ్చు కాని ఏవో ఎవరూ చెప్పలేరు. మొత్తానికి చికాగ్గా మాత్రం ఉన్నాడు.

అది పండుగ గడిచిన మరునాటిరోజు. అంటే ఆరోజుని న్యాయమూర్తులకి పనెక్కువే ఉంటుందన్నమాట. జడ్జీలు సాధారణంగా మనస్సు చికాగ్గా ఉన్నప్పుడే ఇటువంటి నేరాలు విచారించడానికి నిర్ణయించుకుంటారు. మహారాజు తరఫున న్యాయశాసనం పేరు చెప్పి నేరస్థులమీద తమ చికాకంతా వెళ్ళబోసుకుంటారు.

రాబర్ట్ ఇంకా న్యాయస్థానానికి రాకముందే మిగతా న్యాయమూర్తులు నేరవిచారణ ప్రారంభించారు. ఇదిక్కడే పరిపాటే ఆరోజు పొద్దుట ఎనిమిది గంటలనించే న్యాయస్థానం క్రిక్కిరిసిపోయిఉంది. అక్కడొక మూల కొంత చీకటిలో డజన్లకొద్దీ ముద్దాయిలు నిలబడిఉన్నారు. వారిలో స్త్రీలు, పురుషులు, పిల్లలు, పెద్దలు కూడా ఉన్నారు. తీరంపరూ నేరవిచారణ చూసి విని ఆనందించడానికి వచ్చినవారే. క్లాడ్ ఫ్రోలో తమ్ముడు జెహాన్ ఫ్రోలో కూడా ఇక్కడికి చేరాడు. సభికీ, న్యాయమూర్తులూ కూర్చునే ఎత్తైన వేదికకీ మధ్య అయిదడుగుల కర్రగోడ ఒకటి అడ్డుంది. న్యాయమూర్తుల ఆవరణలో గుమాస్తాలున్నారు. వారిలో ఒకడు తొందర తొందరగా ఏదో వ్రాస్తున్నాడు. రాబర్ట్ కూర్చునే పెద్ద కుర్చీ ఒక్కటి మాత్రం ఖాళీగా ఉంది. అక్కడున్న న్యాయాధికారుల్లో మాస్టర్ ఫ్లోరియన్ ముఖ్యుడు. ఈయన రాబర్ట్‌కి కుడిచెయ్యివంటివాడు.

---

మూలం : విక్టర్ హ్యూగో

అనువాదం : సూరంపూడి సీతారామ్

ఫ్లారియన్ బధిరుడు. అతని ఉద్యోగానికిది చిక్కే. అయినా అప్పీలు లేని తీర్పులిచ్చేస్తాడు ఫ్లారియన్. వింటున్నట్లు కనపడితే చాలు, న్యాయవిచారణ సాగిపోతుంది. ఫ్లారియన్ అమిత శ్రద్ధతో వింటున్నట్లు నటించేవాడు—వి సద్దూ అతడి ఏకాగ్రతను భంగపరచడం అసంభవం కాబట్టి.

పక్కనున్న మరొక న్యాయమూర్తిని చూసి ఫ్లారియన్ ఇకిలించాడు: "ఇవాళ ఇద్దరు పెద్దమనుషులు కూడా బికార్లలో కలిశారే! ఓ! జూదమాడుతున్నారు కాబోలు. రాజుగారికి నూరు నాణేలొస్తాయి! ఫరవాలేదు. క్లాడ్ తమ్ముడొచ్చాడు. రాకుండా మానడులే. ఈమాటు ఆడవాళ్ళు కూడా చాలామందే ఉన్నారు.

చూసిన మొహాలే! వీళ్ళందరికీ ఇదోరకం పండగ. మూర్ఖాగ్రేసరుడు కూడా వచ్చాడు. బాగుంది. ఇప్పుడు సభ నిండుగా ఉంది."

నిజంగానే క్వాసిమోడోని పట్టి తీసుకొచ్చారు. అతన్ని చేతులంటగట్టి పగ్గాలతో కట్టేశారు. క్వాసిమోడో కదలకుండా మెదలకుండా ఊరుకున్నాడు. అప్పుడప్పుడతని ఒంటికన్నులో కోపం కనపడుతోంది. క్వాసిమోడో పైన దోషారోపణకి సంబంధించిన కాగితాలు తీసి చూశాడు ఫ్లారియన్. నేరవిచారణకు ముందు ఫ్లారియన్ పత్రాలు పరిశీలించి జాగ్రత్తపడేవాడు. తన ప్రశ్నలకి ఎలాటి జవాబులొస్తాయో ముందే ఊహించుకునేవాడు. వీలైనంతవరకూ తన చెవుడు బయటపడకుండా నిర్వహించేవాడు. ఎప్పుడైనా అసందర్భం జరిగినా, అది న్యాయమూర్తి సూక్ష్మబుద్ధికీ, పరేంగితజ్ఞానానికీ నిదర్శనం అనుకునేవారు. లేదా వార్ధక్యం అనుకునేవారు. మొత్తానికి తనకిగల లోపాన్ని ఇతరులకు తెలియకుండా కప్పిపుచ్చుకోగలిగానని పూర్తిగా నమ్మేవాడు.

పత్రాలన్నీ పరిశీలించిన తరవాత కుర్చీలో వెనక్కి చేరబడి కళ్ళు సగం మూసుకున్నాడు. నిష్పక్షపాతబుద్ధితో శ్రద్ధగా ఆలోచిస్తున్నట్లు కనపడ్డాడు. చెవుడుతోపాటు గుడ్డితనంకూడా అవసరమన్నట్టు కళ్ళు మూసుకున్నాడు—రెండూ ఉంటేకాని న్యాయ నిర్ణేత కాలేడని కాబోలు! సరిగ్గా అలాగే ఉండి ముద్దాయిని ప్రశ్నించడం ప్రారంభించాడు.

"నీ పేరు ?

ఇక్కడో పెద్ద చిక్కొచ్చింది; ఇటువంటి చిక్కులో ఏం చెయ్యాలో న్యాయశాసనం ఏమీ చెప్పలేదు. ఒక చెవిటివాడు మరొక చెవిటివాణ్ని ప్రశ్నిస్తున్నాడు.

అసలే చెవిటివాడైన క్వాసిమోడోకి ప్రశ్న వేసినట్లే తెలియలేదు. అందువల్ల న్యాయమూర్తివంక నిదానంగా చూస్తూ ఉండిపోయాడు. ముద్దాయి చెవిటివాడని తెలియని న్యాయమూర్తి తన ప్రశ్నకి సమాధానం వచ్చిందని ఊహించి తన పని మామూలుగానే కొనసాగించాడు.

"ఓహో! అయితే నీ వయస్సు ?"

క్వాసిమోడో అదేమాదిరిగా మౌనంగా ఊరుకున్నాడు. మళ్ళీ సమాధానం ఇచ్చాడని ఊహించుకుని న్యాయమూర్తి మళ్ళీ ప్రశ్నించాడు.

"నీ వృత్తేమిటి ?"

ఈ తంతు చూస్తున్న సభాసదులు గుసగుసలు మొదలెట్టారు. ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

"అది చాలు" అన్నాడు ఫ్లారియన్. అని ఇలా మొదలుపెట్టాడు:

"నీమీద మోపబడిన నేరాలు ఏమిటంటే: రాత్రివేళ వీధిలో అల్లరిచేశావు; దురాచారి అయిన ఒక స్త్రీని బలాత్కరించడానికి ప్రయత్నించావు; తరవాత రక్షకభటుల్ని ఎదిరించి రాజకార్యాన్ని నిరోధించావు. ఈ ఆరోపణలకి నువ్వేం సంజాయిషీ చెప్పుకుంటావ్ ?"

గుమాస్తావంక తిరిగి న్యాయమూర్తి ఇలా అన్నాడు:

"ఇంతవరకూ వాడు చెప్పిన జవాబులన్నీ రాసుకున్నావా?"

ఈ ప్రశ్నతో సభలో అందరూ పగలబడి నవ్వారు. గుమాస్తాకూడా ఆపుకోలేక నవ్వేశాడు. సభలో అందరూ ఏకమై నవ్వినందువల్ల చెవిటివాళ్లిద్దరికీ ఈమాటు ఈ నవ్వులు వినపడ్డాయి. నవ్వుల్ని లక్ష్యపెట్టనట్లు క్వాసిమోడో భుజా లెగరేసి ముఖం



పక్కకి తిప్పుకున్నాడు. ఫ్లారియన్ ఆశ్చర్యపడ్డాడు. ముద్దాయి భుజాలెగరెయ్యడంకూడా గమనించాడు. ముద్దాయి ఏదో తుంటరి జవాబిచ్చి ఉంటాడని ఊహించుకున్నాడు. కొంచెం కోపం తెచ్చుకుని ముద్దాయిని మందలించాడు.

"అటువంటి జవాబిచ్చినందుకు నిన్ను కొరడాదెబ్బ వేయించవచ్చునని తెలుసా? నువ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుసా?"

దీనితో మరింత విరగబడి నవ్వడం మొదలుపెట్టారు జనం. సార్జెంట్లు, గుమాస్తాకూడా నవ్వాపుకోలేకపోయారు. నవ్వకుండా ఉన్నవాడు క్వాసిమోడో ఒక్కడే. ఏం జరుగుతోందో అతనికి తెలియదు. ఫ్లారియన్‌కి కోపం వచ్చింది. ముద్దాయిని గట్టిగా బెదిరిస్తేగాని తుంటరిమాటలు మానడనుకుని ఇలా అన్నాడు:

"న్యాయమూర్తిని న్యాయసభలోనే అవమానించడానికి నీ కింత సాహసం ఎల్లావచ్చిందిరా? జీతం బత్తెం లేకపోయినా న్యాయసంరక్షణకోసం మహారాజు ఆజ్ఞప్రకారం న్యాయం నిర్వహిస్తున్నానని తెలియదూ? నువ్వెవరితో మాట్లాడుతున్నావో ఒళ్లు తెలియకుండా......"

ఫ్లారియన్ నాగ్గాటి ఎంతదూరం పోయేదో తెలియదు కాని ఇంక సభాసదులు భరించలేకపోయారు. అంతలోనే సభఅంతటా అకస్మాత్తుగా నిశ్శబ్దం వ్యాపించింది. వెనుక తలుపు తెరుచుకుంది. ప్రధాన న్యాయాధికారి రాబర్ట్ ప్రవేశించాడు. ఫ్లారియన్ లేచి నిలబడి అభివాదంచేశాడు; చేసి నిలబడే కోపంతో ఇలా అన్నాడు: "న్యాయస్థానంలో మర్యాదగా ప్రవర్తించనందుకు వీడికి కఠినశిక్ష విధించి తీరాలండి."

గుక్కతిప్పుకుని వెంటనే కూచున్నాడు ఫ్లారియన్. నుదుటిపై చెమట తుడుచుకున్నాడు. రాబర్ట్ కోపంతో ముద్దాయిని చూశాడు.

"నీ నేర మేమిటి?" అని ప్రశ్నించాడు రాబర్ట్.

ఈమారు క్వాసిమోడో తన పేదో న్యాయమూర్తి ప్రశ్నిస్తున్నాడని గ్రహించాడు. అది తన పేరై ఉంటుందని ఊహించుకుని బొంగురు గొంతుకతో జవాబిచ్చాడు.

"నా పేరు క్వాసిమోడో."

ఆ ప్రశ్నకి ఈ జవాబు విని అందరూ మళ్ళీ నవ్వారు. రాబర్ట్ కోపం మితిమీరింది.

"నాతో కూడా పరియాచక మాడుతున్నావురా?" అని ఉరిమాడు.

"నాటర్ డామ్ చర్చిలో గంట వాయించేవాణ్ని" అన్నాడు క్వాసిమోడో. రెండో ప్రశ్న ఇందుకే ననుకున్నాడు.

రాబర్ట్ పొద్దుటినుంచీ చికాగ్గా ఉన్నాడని మొదటే చెప్పబడింది.

"నీ వీపు గంటలా మోగేలా చేస్తాను తెలుసా? నీ తుంటరితనానికి బుద్ధి చెప్పగలను జాగ్రత్త! వినపడుతోందా?"

"నా వయస్సా?" అన్నాడు క్వాసిమోడో. "కొద్దిరోజుల్లో ఇరవై యేళ్లు నిండుతాయి."

రాబర్ట్‌కి ఓపిక నశించింది. "ఆ! నన్నే ఎదిరిస్తున్నావా? ఉండు నీ పని చెప్తా. వీణ్ని తీసుకుపోయి గ్రీవ్ చౌకులో గంటసేపు కొరడాదెబ్బ వెయ్యండి. ముందు కొరడాలతో కొట్టి తరవాత గంటసేపు కొరడాదెబ్బ వెయ్యండి. పారిస్ అంతా చాటించి అందరి సమక్షంలో ఈ తుంటరిని హింసించండి" అని ఆజ్ఞాపించాడు. గుమాస్తా పరపర వ్రాసిపారేశాడు.

"బలే! బలే శిక్ష వేశారు" అన్నాడు జెహాన్ ఫ్రాలో సభలోనుంచి.

క్వాసిమోడో నేరానికి విచారణ ముగిసింది. శిక్ష విధించబడింది. ఆ రోజుల్లో శిక్ష విధించడానికి న్యాయశాసనాలాట్టే ఉపకరించేవి కావు. అందువల్ల నేరం విచారించి తీర్పు ఇచ్చి శిక్షలు విధించడం సులువుగా ఉండేది. నేరస్థుల్ని తిన్నగా కొరతకో, చక్రానికో, ఉరిస్తంభానికో పంపించేవారు. ఏ శిక్ష పడుతుందో ఊరందరికీ ముందే తెలిసేది.

గుమాస్తా కాగితం న్యాయమూర్తి కిచ్చాడు. న్యాయమూర్తి ముద్ర వేశాడు. లేచి మిగతా న్యాయమూర్తుల పని తనిఖీ చెయ్యడానికి వెళ్ళిపోయాడు. క్వాసిమోడో నిర్లిప్తభావంతో అంతా చూస్తున్నాడు.

పత్రం తీసుకుని ఫ్లొరియన్ పరిశీలించ నారంభించాడు. గుమాస్తాకి ముద్దాయిపట్ల జాలి కలిగింది. మెల్లిగా లేచి న్యాయమూర్తి చెవులో అన్నాడు: "పాపం! వాడు చెవిటివాడు."

పం యిద్దరికీ ఒకటే కాబట్టి ఫ్లొరియన్ దయ తల్చగలడని గుమాస్తా భావించాడు. కాని తన చెవుడు ఎవరికీ తెలియదనుకునే ఫ్లొరియన్‌కి దయ కలగలేదు. అసలు గుమాస్తా చెప్పిన మాటల్లో ఒక్క అక్షరం వినపడలేదు. అయినా విన్నట్లు నటించి "ఓ! అల్లాగా! నాకు తెలియలేదు. అయితే ఇంకో గంటసేపు వీపు పెట్లగొట్టమందాం." అంటూ పత్రంమీద తను మార్పుచేసి సంతకం పెట్టేశాడు.

## 17

ఉదయం పదిగంటలయింది. గ్రీవ్ చౌకు చూస్తే పండుగ గడిచిన మరుచటి రోజని తేటపడుతుంది. వీథులనిండా బాణసంచా కాల్చగా మిగిలిన తుక్కు, కర్రముక్కలు, రాళ్ళు. చెత్త, చెదారం విరజిమ్మినట్లుంది. కొందరా చెత్త తన్నుకుంటూ నడుస్తున్నారు; కొందరు తప్పుకొనడానికి ప్రయత్నిస్తున్నారు, అంగళ్లు తెరిచారు; వ్యాపారం సాగుతోంది. అక్కడక్కడ కొందరు రాత్రి జరిగిన విశేషాలు చెప్పుకుంటున్నారు.



# ఘంటారావం



చౌకుమధ్యలో ఇనపచక్రం, కొరత, ఉరిస్తంభం ఉన్నాయి. కొరతదగ్గర గుర్రాలెక్కిన నలుగురు సార్జెంట్లు కాపుదల చెయ్యడంచూసి జనం పోగుబడ్డం ప్రారంభించారు. సార్జెంట్లు కాపువేశారంటే కొరతో, ఉరో ఏదో ఒక వినోదం ఉంటుందని ప్రజలకు తెలుసును.

గ్రీవ్ చౌకులో నిలబడి పశ్చిమానికి చూస్తే రోలండ్స్ టవర్ కనపడుతుంది. అక్కడ ముందుభాగంలో గూడు అమర్చి, అందులో పెద్ద బైబిల్ పుస్తకం ఒకటుంచారు. గూడుముందు ఇనపగుంజలు పాతి ఉంచారు. పుస్తకాన్ని ఎవరూ దొంగిలించకుండా రాతి తిన్నెపై ఒక గొలుసుతో బంధించారు. ఇనపగుంజల మధ్యనుంచి చేతులు జొనిపి పుస్తకం పేజీలు తిప్పడానికి మాత్రం వీలుంటుంది. రాత్రివేళకూడా చదవడానికి వీలుగా లోపల దీపాలు పెడతారు. ఈ గూడుప్రక్కనే ఒక చిన్న కిటికీ ఉంది. ఈ కిటికీకి రెండే ఇనపఊచలున్నాయి. ద్వారమైనా లేని అక్కడి కూపానికిదొక్కటే గాలి వెలుగుల కాధారం.

మత యుద్ధాలలో తండ్రి మృతిచెందగా జీవితంపైన రోతపుట్టి మేడామ్ రోలండ్ ఈ టవర్‌లో గోడ పడగొట్టించి అంధకార కూపాన్ని నిర్మింపచేసింది. తనకుగల సర్వస్వాన్నీ బీదలకూ భగవత్కార్యాలకూ సమర్పించి ఈ కూపంలో తనను తాను నిర్బంధించుకుంది. వెనుక ద్వారం ఉన్నచోటు రాళ్లతో పూడ్పించింది. తండ్రి ఆత్మశాంతికోసం రాత్రింబగళ్లు దైవధ్యానంచేస్తూ ఈ కూపంలోనే గడిపింది. కటికరాళ్లపైనే నిద్రిస్తూ నల్లని నారదుస్తులు ధరించి, దారినపోయేవారు దయతలిచిఇస్తే రొట్టె, నీళ్ళుమాత్రం పుచ్చుకుంటూ ఇరవైయేళ్లు ఈ కూపంలో మగ్గిపోయి చివరకు ఇక్కడే మృత్యువు నాలింగనం చేసుకుంది. తన అనంతరం తనవలె జీవితంపైన విరక్తి జుగుప్సపొందిన స్త్రీల కఠోర దీక్షకు ఈ కూపం వినియోగపడాలని ఆమె నిర్ణయించింది. పేదలు బికారులు ఆమె జ్ఞప్తికి వచ్చినప్పుడు కంటతడిపెడుతారు. ఉన్నత మతాధికారుల ప్రాపులేకపోబట్టి కాని లేకపోతే ఆమె సెయింట్‌గా చరిత్రకెక్కేది. ఆమె స్మృత్యర్థం పారిస్ అధికారులు ప్రక్కనే గూడుకట్టి అందరూ చదవడానికీ ప్రార్థించడానికీ వీలుగా బైబిల్ నెలకొల్పారు.

మధ్య యుగాలలో ఇటువంటి సమాధులు అరుదుకావు. జనసమ్మర్దంకల ప్రదేశాలలో ఇటువంటి సమాధులు నిర్మించుకుని ప్రాయశ్చిత్తం చేసుకునేవాళ్ళు విరాగులు, స్త్రీలు, పురుషులు కఠోరదీక్ష పూనేవారు. కొందరికి గృహజీవితంనుంచి గోరీకి ఈ సమాధి మధ్య మజిలీ అన్నమాట. మానవసమాజంనుంచి విడివడి ఇక్కడికి చేరినవారు దాదాపు చనిపోయినవారితో సమానులు. తైలం హరించిపోతున్నకొద్దీ తమస్సులోకి అంతర్ధానం కావడానికి కొసుకూక్కుచున్న దీపాలవలె ఈ సమాధులలో నిర్భాగ్యులు మృత్యువుకోసం ఎదురుచూస్తూ ఉండేవారు. సమాధిగతజీవి దృష్టి పరలోకంవైపే ఉండేది. ఆ కన్నులలో మరోలోకాల వెలుగు చీకట్లే కనపడేవి. ఆ పంజరంనుంచి విడివడ్డంకోసం ప్రాణి గిజగిజలాడేది. ఆ ఆత్మకా శరీరం చెరసాల, ఆ శరీరానికి ఈ సమాధి చెరసాల. ఆ పంజరానికీ, ఆ కటికరాళ్ళకూ మధ్యపడి నలిగే ప్రాణి విముక్తికోసం ఆక్రోశించేది. ఆ వ్యక్తుల బాధలేవో తెలుసుకోడం కాని వారిపట్ల జాలికాని ఆనాటి ప్రజలకు అనవసరం. వారిని మాత్రం అతిపవిత్రులని యెంచి పూజించి, వారికోసం ప్రజలు భక్తిభావంతో దైవాన్ని ప్రార్థించేవారు. ఆనాటి దైవభక్తి భావంలో దాక్షిణ్యభావానికి చోటులేదు. దర్శనార్థం వచ్చే యాత్రికులకు సమాధిలోని వ్యక్తికి జీవితంపైన ఎందుకు రోత పుట్టిందో, ఆ బాధ లేమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉండేది కాదు; చూసి దైవాన్ని ప్రార్థించి దీక్షాగతికి ఆశ్చర్యపడి ఊరుకునేవారు. ఆరోజుల కింకా సైన్సుకోసం మైక్రోస్కోప్, తత్వజిజ్ఞాసకోసం తత్వశాస్త్రం తయారుకాలేదు.

పారిస్‌లో ఇటువంటి సమాధులు ఆనాటికి చాలానే ఉండేవి. సమాధులు ఎక్కడైనా ఖాళీపడి పశ్చాత్తప్తులు, విరాగులు దొరక్కపోతే చర్చి ఊరుకునేది కాదు. ఎవరూ దొరక్కపోతే కుష్ఠురోగుల్ని తీసుకువచ్చి ఉంచేవారు.

రోలండ్స్ టవర్ సమాధి నిర్మించబడిన మూడు వందల యేళ్లనుంచీ ఎన్నడూ ఖాళీగా ఉండలేదు. ఇప్పుడు (కథా కాలం నాటికి) సమాధిలో శల్యావశిష్ట అయిన ఒక స్త్రీ ఉంది.

గ్రీవ్ చౌకులోకి వెడుతూ ముగ్గురు స్త్రీలు సమాధి దగ్గర పడగానే ఆమెనుగురించే మాట్లాడుకుంటున్నారు. వీరిలో యిద్దరు పారిస్ నగరవాసులు; ఒకామె కొత్తగా పారిస్ వచ్చింది. ఈమె చెయ్యిపట్టుకుని ఒక బాలుడున్నాడు. అతనిచేతిలో పెద్ద రొట్టెముక్క ఉంది. తల్లి మనస్సు ప్రసంగంలో మగ్నమైవుంటే కొడుకు రొట్టెముక్కని తదేకదృష్టితో గమనిస్తున్నాడు. రొట్టె కొరికెయ్యాలని అతని కెంతో కోరికుంది కాని కొరక్కుండా దానివంక చూస్తూ ఊరుకున్నాడు.

"ఆలస్యమైపోతోందే! త్వరగా నడవాలి మనం."

"పరవాలేదు. రెండుగంటలసేపు కొరతలో ఉంటాడులే. నువ్వెప్పుడేనా కొరతవెయ్యడం చూశావా?"

"చూశాను... రీమ్స్‌లో"

"అబ్బే! అక్కడ అదీ ఓ కొరతేనా?"

"ఏం? పెద్దపెద్ద వాళ్ళకొరతేశారక్కడ. నేను చూశాను. ఒకడు అమ్మనీ నాన్ననీకూడా చంపాట్ట, వాణ్ని కొరతవెయ్యడం నేను స్వయంగా చూశాను."

"అయినా అది పారిస్‌లో మాదిరిగా ఎల్లావుంటుందిలే."

"అదేవిటో? చౌకు అవతల వంతెనమీద? అంతమంది జనం మూగారెందుకో అక్కడ?"

"తంబుర వినపడ్డంలేదూ? ఎమరాల్డా వచ్చిఉంటుంది. దాని దగ్గిర మేకపిల్ల బలే అభినయం చేస్తుంది. వెళ్లిచూద్దామా?"

"ఎవరో?"

"జిప్సీజాతి."

"ఆ!" అంటూ కొత్తగావచ్చినామె కొడుకుని దగ్గరకు లాక్కుంది భయంతో. "వొద్దొద్దు. అక్కడికి వెళ్ళద్దు. జిప్సీలు పిల్లల్నెత్తుకునిపోతారు." ఆమె ఇంక కదలకుండా దారి మధ్యలో ఆగిపోయింది.

పారిస్ వనిత లిద్దరూ తెల్లబోయారు. తరవాత నవ్వేశారు. "ఛ! వాళ్ళు పిల్లల్నెత్తుకుపోడమేమిటి? ఎక్కడా వినలేదు." అంది ఒకామె.

ఇంకొకామె ఆలోచించింది. "చిత్రం! సిస్టర్ గ్రిలా కూడా ఇలాగే అంటుంది సుమా!"

"సిస్టర్ గ్రిలా ఎవరు?"

"తెలీదూ? అదుగో అక్కడ చూడు. ఆ సమాధిలో ఉంటుంది, ఆవిడ."

"మనం రొట్టె తీసుకెళ్లేది ఆవిడకోసమే కాదూ?"

"అవిడే. తంబుర పట్టుకు తిరుగుతూ జోస్యం చెప్తానంటారు. ఆ జిప్సీల్ని చూస్తే ఆమెకి తగని కోపం. అయితే నీకూడా ఎందుకొచ్చిందా భయం."

రీమ్స్‌నించి వచ్చినవనిత కొడుకుని దగ్గరకు తీసుకుని ఇలా అంది "రీమ్స్‌లో అటువంటి దొకటి జరిగింది."

"ఏం జరిగింది?"

"పారిస్‌లో ఉన్నారు, మీకు తెలియదూ?"

"చెప్పేం జరిగిందో, నడుస్తూ ఉందాం."

"ఆమెకి సరిగ్గా నా యీడే ఉండేది. పేరు పాక్వెత్ శాంటెఫ్లూరీ. చిన్నతనంలో తండ్రిపోతే తల్లే కష్టపడి పెంచేది. కాని తల్లి గారాబం చేసింది. చాల చక్కగా ఉండేది. కాని తెగ నవ్వేది, అంతగా నవ్వితే చేటని తెలియదు. అసలు పళ్ళు కనపడితే కళ్ళు మెరవ్వటం. తెలివితక్కువది. ఇట్టే పాడయింది. భాగ్యవంతుణ్ని పెళ్ళాడాలని ప్రయత్నించేది. దాని అందం చూసి స్నేహం చేసేవాళ్ళేకాని పెళ్లిచేసుకునేవాళ్లు మాత్రం కనపడలేదు. పెళ్ళికాక పిచ్చెత్తినట్టుండేది. చివరికి పెళ్ళి కాకుండానే ఒక ఆడపిల్ల పుట్టింది. సరిగ్గా ఇది జరిగి ఇప్పటికి పదహారేళ్ళవుతుంది. తల్లి చచ్చిపోయింది కాబట్టి బాధపడేవాళ్లు లేరు. ఆమె పుట్టిన కూతుర్ని చూసుకుని మురిసిపోయేది. ఆ కూతురు తప్ప ఆమె కింక లోకంలో నా అనేవాళ్లెవరూ లేరు. పాపం! అందరూ తిట్టేవాళ్ళు. మొహంమీద ఉమ్మేసేవాళ్లు. తనకి తినడానికి తిండి లేకపోయినా కూతుర్ని అతి ముద్దుగా పెంచుకునేది. ఎప్పుడూ తన పేదరికానికీ పతనానికీ ఏడుస్తూ బిడ్డని గుండెలకి హత్తుకుని ముద్దులు పెట్టుకుంటూ వుండేది. కొందరు ఆమె పిచ్చి దనుకునేవాళ్లు. ఇంక దారిద్ర్యం భరించలేక పడుపు వృత్తితో డబ్బు సంపాదించి బిడ్డని పెంచుకునేది. బిడ్డకి ఏ లోటూ రాకుండా విచ్చలవిడిగా డబ్బు ఖర్చు పెట్టేది. కూతురుకి ఏగ్నిస్ అని పేరు పెట్టుకుంది. శాటిన్ గుడ్డలు తప్ప మరేవీ తొడిగించేది కాదు. బంగారు నగిషీ ఉన్న బుల్లివి మెత్తని గులాబిరంగు బూట్లు తొడిగించేది. అలాంటి బూట్లు నే నెప్పుడూ చూడలేదు. రాజుల ఇళ్లల్లో కూడా పిల్లలంత సుకుమారంగా పెరగరు. అలా పెంచేది. పిల్ల పాదాలు మరీ చిన్నవిగా ముద్దొస్తూ ఉండేవి. చూస్తేగాని అంత చిన్నవని నమ్మడం కష్టం. అందుకోసం ఆ బూట్లు స్వయంగా కుట్టిందిట. ఏగ్నిస్‌ని ఏడాది నిండాక చూశాను. అబ్బ! ఎంత చక్కగా ఉండేదనుకున్నారు! మాటల్లో చెప్పలేను. మాతికన్న కళ్లు పెద్దవనుకో. చక్కని నల్లటి జుట్టు ఉంగరాలు తిరిగిఉండేది. పిల్ల పెరుగుతున్నకొద్దీ తల్లి ఆపేక్ష పెరిగిపోయింది. ఎప్పుడూ ఆ బుల్లిపాదాలు ముద్దు పెట్టుకుంటూ ఉండేది.

"ఒక రోజుని జిప్సీలు తండాలు తండాలుగా వచ్చారు ఆవూరు. చెయ్యిచూసి జోస్యం చెప్పి డబ్బు పుచ్చుకునేవాళ్ళు. చూస్తే భయంకరంగా ఉండేవాళ్ళు. వాళ్ళు పిల్లల్నెత్తుకుపోతారనీ, జేబులు కొట్టేస్తారనీ, దోపిడి జరుపుతారనీ, మనుషుల్ని చంపి మాంసం తింటారనీ పుకార్లు పుట్టాయి. వాళ్లదగ్గరకు వెళ్లద్దని పెద్దవాళ్లు చిన్నవాళ్లని కోప్పడేవాళ్లు. కాని మళ్ళీ పెద్దవాళ్లే వెళ్లి చేతులు చూపించుకునేవాళ్లు. 'నీ కొడుకు రాజవుతాడు, గొప్ప మతాధికారి అవుతాడు, పెద్దపేరు తెచ్చుకుంటాడు' ఇల్లా జోస్యం చెప్పేవాళ్లు జిప్సీలు. పాపం శాంటెఫ్లూరీకూడా కూతుర్ని తీసుకెళ్లి చెయ్యి చూపించింది. జిప్సీలు ఆ పిల్ల అందంచూసి ఆశ్చర్యపోయారు. పిల్లనిచూసి మెచ్చుకుని మహారాణి అవుతుందని చెప్పారట. దాంతో తల్లి ఉబ్బి తబ్బిబ్బైపోయి ఇంటికెళ్లింది. మర్నాడు పొద్దుని పిల్లకి పొటనిండా పాలుపోసి నిద్రపోగొట్టి, పిల్ల అదృష్టాన్ని నలుగురితో చెప్పుకోవాలని తొందరలో తలుపువెయ్యడం మర్చిపోయి పొరుగింటికెళ్లింది. మళ్ళీ తిరిగొచ్చేసరికి పక్కలో పిల్లలేదు. బూట్లజతలో ఒక్కటి మాత్రం పక్కకింద పడివుంది. పాపం ఇంక ఆ తల్లిగోల చెప్పలేను. జుట్టు పీక్కుని ఏడుస్తూ మొత్తుకుంటూ వీధిని పడింది. ఇరుగూ పొరుగూ చంటిపిల్లమీద ముక్కువ కొద్దీ ఊరంతా గాలించారు. తల్లి ఆరోజు ఊళ్ళో తిరగని చోటులేదు, వెతకని మూలలేదు. ఎవరు కనపడితే వాళ్లని నిలేసి 'నా కూతురు కనపడిందా' అని అడిగేది. అంత చక్కనిదీ వెర్రిబాధతో ఒక్కపూటలో పూర్తిగా రూపు మాసిపోయినట్లయింది. ఆమె ఏడుపు వింటే అందరికీ కడుపు తరుక్కుపోయింది. 'నా పిల్లని నాకు తెచ్చిపెట్టండి. మీ యింట్లో దాసిగా ఉండిపోతాను. మీరేం చెప్పినా ఏం చేసినా ఒప్పుకుంటాను' అని అందర్నీ వేడుకుంది. ఆ సాయంకాలం ఎవరో చెప్పారు ఒక చక్కని ఆడపిల్లని జిప్సీలు తీసుకెళ్లడం చూసినట్టు.

రాత్రి ఇంటి కొచ్చింది ఏడుస్తో. ఇంటిదగ్గర కొచ్చేసరికి ఇంటిలోనించి ఏడుపు వినపడింది. తల్లీ మరికొందరూ కలిసి అదరాబాదరా పరుగెత్తి చూశారు. ఆశ్చర్యం! ఒంటికన్నుతో, గూనితో వికృతంగా ఉన్న ఒక పసిపిల్లాడున్నాడు పక్కలో. తన కూతుర్ని మంత్రించి ఇల్లా చేశారని తల నేలకొట్టుకుని ఏడ్చింది తల్లి. తల్లికి పిచ్చెక్కిపోతుందని భయపడి పక్కవాళ్లు ఆ పసిపిల్లాణ్ని తీసుకుపోయారు. ఇంక తల్లి మిగిలిన ఆ ఒక్క బూటూ తీసుకుని ముద్దు పెట్టుకుంటూ ఒకటే ఏడుపు. ఆ రోజుని ఆ ఊళ్లో కంట తడిపెట్టనివాళ్ళు లేరంటే నమ్ము.

"ఉన్నట్టుండి అకస్మాత్తుగా లేచింది. లేచి జిప్సీలు మకాం చేసిన చోటుకి పరుగెత్తింది. ఆమెవెంట కొందరు వెళ్ళారు. కాని ఏం లాభం! అప్పటికే జిప్సీలు మకాం ఎత్తేసి ఎటో వెళ్లిపోయారు. వాళ్ళా పిల్లను చంపి తినేశారని కొందరనుకున్నారు."

"తరవాతేమైంది?"

"ఏమో! మళ్ళీ ఆ తల్లి కనపడలేదు. చచ్చిపోయిందని కొందరంటారు. కొందరు కాలినడకని పారిస్ వచ్చిందంటారు. ఏది నిజమో ఎవరికీ తెలియదు."

"మరి ఆ పిల్లాడు?"

"పారిస్ పంపించారని విన్నాను. నాటర్‌డామ్ చర్చిలో విడిచిపెట్టారట. ఆతరవాత ఏమయిందో తెలియదు."

ముగ్గురూ తరవాత మౌనంగా నడక సాగించారు. ఆలోచనలోపడి రోలండ్స్ టవర్ దాటి చౌకు సమీపించారు.

అక్కడ కొంతదగ్గిర చేరిన గుంపు చూశారు. సమాధిమాట మరిచిపోయారు. కాని పిల్లవాడికే అంతర్వాణి చెప్పిందో తెలియదు. "అమ్మా! ఇంక నేను తినచ్చా ఈ రొట్టె?" అని అడిగాడు. కాని వాడు తొందరపడ్డాడు. ఇల్లు చేరిందాకా ఊరుకునివుంటే రొట్టె వాడికే దక్కేది. ఇప్పుడు తల్లికి జ్ఞాపకం వచ్చింది.

"అరె! మరిచిపోయాం. ఏదీ ఆ సమాధి చూపించు. రొట్టె ఇచ్చేసివద్దాం" అంది వాడి తల్లి పారిస్ వనితల్తో.

"అవునవును. నడవండి" అని అందరూ వెనక్కి తిరిగారు. సమాధివద్దకు చేరారు.

ముందు ఒకామె కిటికీలోనుంచి తొంగిచూసింది. చూడగానే ఆమె ముఖంలో జాలి, వ్యథ వ్యక్తమైనాయి. మిగిలిన యిద్దరూ నిశ్శబ్దంగా లోనికి చూశారు.

పట్టపగలే మసకచీకటి ఆవరించిఉన్న ఆ కూపం చాల చిన్నది. రాళ్ళతో కప్పబడిన నేల. ఒకమూల ఒకామె కూర్చుని ఉంది. చేతులతో మోకాళ్ళను చుట్టకూచుని, మోకాళ్లపై గడ్డమానించి ఎదురుగా మరొక మూలవంక నిశ్చలంగా చూస్తోంది. తెల్లగా పండిపోయిన జుట్టు చీదరగా చుట్టూ వేలాడుతోంది.

 ఘంటారావం 

నిశ్వాసమైనా విడుస్తున్నట్లు కనపడదు. చలనంలేని ఆ వ్యక్తిని చూస్తే బ్రతికి ఉందనుకోడం కష్టం. ఆ కనుచీకటిలో స్పష్టంగా లేని ఆ ఆకారాన్ని చూస్తే, అది నిజమో, కలో తెలియదు.

ఆ రాళ్లమధ్య అతుక్కుపోయినట్లున్న ఈ ఆకారానికి చలనం కాదుకదా నిశ్వాసంకాని స్మృతి చైతన్యంకాని లేవనిపిస్తుంది. భయంకరమైన ఈ శీతల వాతావరణంలో కూడా చేతులకు కాళ్లకు రక్షణలేదు. ఉన్న ఒక్క కిటికీలోనుంచి చలిగాలి విసుర్లు తప్ప సూర్యకాంతి ప్రవేశించదు. కనురెప్ప వాల్చని ఆమె శిలా ప్రతిమ అని తోచక మానదు. ఆమె దృష్టిని ఆ గదిలో ఒక మూల కేంద్రీకరించింది. కనురెప్పలు వాల్చడంలేదు. ఆ మూల ఏముందో కిటికీ ఇవతలనుంచి చూసేవారికి కనపడదు. రీమ్స్ వనిత ఏదో అనబోయింది. కాని మిగిలిన ఇద్దరూ వారించారు. "ప్రార్థనలో ఉంది. మాట్లాడకూడదు." అంది ఒకామె.

రీమ్స్‌నించి వచ్చిన వనిత ఏదో తెలియని ఆందోళనతో పరిశీలించసాగింది. "చాల చిత్రంగాఉందే!" అంది.

"ఏమిటి చూస్తోంది?" అని మళ్ళీ అడిగింది. మిగిలిన ఇద్దరూ తప్పుకున్నారు. ఆమె ముందుకువచ్చి కిటికీ ఊచలమధ్య వీలైనంతవరకు తల దూర్చి ఆ మూల చూసింది. చూడగానే ఆమె ముఖం ఎర్రబడిపోయింది. పెదవులు కదులుతున్నాయి కాని నోట మాట రాలేదు. చివరికి ఇలా అంది.

"ఆమె పేరేమిటి?"

"సిస్టర్ గ్వర్లా."

"కాదు. ఆమె పాక్వెత్ శాంటిఫూరీ."

అందరూ విభ్రాంతులైనారు. రీమ్స్ వనిత వేలితో లోపల ఆ మూల చూపింది. ఇద్దరూ ఒకరి తరవాత ఒకరు ఊచలలో తలదూర్చి ఆమూల చూశారు. ముగ్గురూ నిర్ఘాంతపోయారు. ఆ మూల ఉన్నది గులాబీరంగు బుల్లి బూటు. రంగు కొంత మాసింది.

ముగ్గురూ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. ఆమె మాత్రం వీరి ముగ్గురి ఉనికి ఇంతవరకూ కనిపెట్టనేలేదు.

కొంతసేపు ముగ్గురూ మౌనంగా ఉండిపోయారు. తరవాత ఒకామె అతి జాలిగా పిలిచింది: "సిస్టర్ గ్వర్లా, సిస్టర్"

కాని సిస్టర్ పలకలేదు. ఆమెకి వినపడలేదు. మరొకామె పిలిచింది. మూడుసార్లు పిలిచింది. కాని సిస్టర్ గ్వర్లా మేలుకోలేదు.

"చెవుడు కాబోలు"

"గుడ్డిదేమో!"

"అసలు బతికివుందా?"

ఆమె చచ్చిపోలేదు. కాని ఆమె స్మృతి ఎక్కడో ఏ చీకటి మూలనో దాగింది. ఆ చీకటికోణాన్ని ఆమె బహిరింద్రియాలు స్పృశించలేవు.

"ఏం చెయ్యడం? ఈ రొట్టె కిటికీలో పెడితే ఎవరో ఒకరు ఎత్తుకుపోతారు."

అంతవరకూ వీధిన వెడుతున్న బండి చూస్తూ, బండి చూపు దాటిపోగానే పిల్లవాడు తల్లివంక తిరిగాడు. ముగ్గురూ కిటికీలోనించి చూడ్డం కనిపెట్టాడు. "ఎవరే అమ్మా? నన్నుకూడా చూడనియ్యవే." అన్నాడు.

పసిపిల్లవాని స్పష్టమైన కంఠస్వరంవినగానే సిస్టర్ ఒక్కసారి ఉలిక్కిపడింది. కిటికీవంక తిరిగి ముఖంమీదినుంచి జుట్టు తొలగించి చూసింది. ముఖమంతా ముడతలు చిక్కులు పడ్డాయి. విభ్రమం, విషాదం ఉట్టిపడే ఆమె కన్నులు, పిల్లవానిపై పడ్డాయి వెంటనే ఆమె కన్ను లొక్కసారి తళుక్కుమన్నాయి. "అయ్యో దేవుడా! ఇతరుల పిల్లలైనా నా దృష్టిలో పడకుండా చెయ్యలేవా?" అంది. సత్తువ పూర్తిగా నశించిన ఆమె మాటలు గుండెలు చీల్చుకు వచ్చినట్లున్నాయి. తరవాత ఆమె శరీరమంతా ఒక్కసారి గాలిలో ఆకువలె గజగజ వొణికిపోయింది. కొద్దిగా తలెత్తింది. చేతులతో పాదాలు రాసుకుంది. "అబ్బ! ఎంత చల్లగా ఉన్నాయి" అనుకుంది.

"పాపం! లోపల కొంచెం మంట వేసుకుంటారా పోనీ వెచ్చగా ఉంటుంది" అంది ఒకామె.

సిస్టర్ వొద్దన్నట్లు తలూపింది.

"పోనీ పల్చని బ్రాందీ ఉంది తీసుకుంటారా! ఒళ్ళు కొంచెం వెచ్చనౌతుంది" అంటూ ఒక సీసా చూపింది.

సిస్టర్ వొద్దన్నట్లు తలూపింది. "మంచినీళ్లు" అంది.

"ఇంత చలిలో నీళ్ళు తాగకూడదు సిస్టర్. ఇది కొంచెం తీసుకోండి. నీకోసం మంచి రొట్టికూడా తీసుకొచ్చాం." అని రొట్టె అందించింది.

సిసర్ అదీ వొద్దంది. "కొయ్యరొట్టె మాత్రమే" అంది.

"పోనీ ఇదైనా తీసుకోండి" అంటూ పై కోటుతీసి ఇవ్వబోయింది.

"నారదుస్తులే నాకు" అంది సిస్టర్ ఇదికూడా నిరాకరిస్తూ.

"నిన్న పండగరోజు. ఈపూట కొంచెం మంచి రొట్టె తీసుకోండి."

"పండగ! తెలుసు. అందుకే కాబోలు రెండు రోజుల్నించి నా కూజాలో నీళ్ళు లేవు. అయినా నేను లోకంగురించే ఆలోచించను; నాకోసం లోకు లెందుకు తాపత్రయపడ్డం? మంట ఆరిపోగానే నిప్పులు చల్లబడిపోతాయి."

ఈమాత్రం మాట్లాడినందుకే అలసిపోయినట్లు మోకాళ్లలో తల వాల్చేసుకుంది.

"పోనీ కొద్దిగా చలిమంటైనా వేసుకోండి, లోపల."

"చలిమంటా?" అంది సిస్టర్. ఈమాటు ఆమె కంఠస్వరం మారిపోయింది. బొంగురు గొంతుకతో ఇలా అంది: "పదిహేనేళ్లనించి ఎక్కడుందో కళ్ళబడని నా బిడ్డకి మీరు చలిమంట వెయ్యగలరా?"

ఆమె స్వరం వొణికింది. కాలుచేతులు వొణికిపోయాయి. కన్నులలో మరొకసారి మెరుపులా చైతన్యం మెరిసింది. పాలిపోయి ఎముకలు మాత్రం మిగిలిన చెయ్యి చాపి పిల్లవాణ్ని చూపుతూ అంది: "అబ్బాయి నిక్కడనించి తీసుకుపోండి. ఆ జిప్సీది ఇప్పుడే దారినే వస్తుంది."

మోకాళ్ళలో ముఖం దాచుకుంది. తరవాత కొంతసేపటికి ఆమె కదిలింది. మోకాళ్లపైనా చేతులపైనా పాకుతూ మూలకు వెళ్లిపోయింది. ఇప్పుడామె ముగ్గురు స్త్రీలకూ కనపడ్డంలేదు. మూలనించి మాత్రం ముద్దులూ, గాఢ నిశ్వాసధ్వనులూ వినవచ్చాయి. కిటికీలోనుంచి తలదూర్చి చూసే సాహసం ఎవరికీ లేకపోయింది. తరవాత అణుచుకుంటున్న ఏడ్పు, గోడకు తల బాదుకుంటున్న చప్పుడు వినవచ్చాయి. ఆపైన ఒక్కసారి గట్టిగా తలకు దెబ్బతగిలిన చప్పుడు వినపడింది. అంతే ఆపైన నిశ్వాసం కూడా వినరాలేదు.

ముగ్గురికీ ఒళ్లు కంపించింది.

"అబ్బ! తల గోడకేసికొట్టుకుంది. చచ్చిపోయిందేమో!"

తరవాత ఆందోళన పట్టలేక ఒకరివెంట ఒకరు 'సిస్టర్, సిస్టర్' అని పిలిచారు. ఎన్నిసార్లు పిలిచినా ఆమె పలకలేదు.

"ఆగండి నేను చూస్తాను" అంది రీమ్స్ వనిత.

"పాక్వెత్? పాక్వెత్ శాంటిఫ్లూరీ"అని పిలిచింది. వెంటనే ముగ్గురూ వెనక్కి ఒక్కడుగువేశారు. సిస్టర్ ఒక్క ఉదుటున లేచి నిలబడింది. ఒళ్లంతా గజగజ వొణికిపోతోంది. కళ్ళలో నిప్పులు కురుస్తున్నాయి. ఒక్క అడుగులో కిటికీవద్దకు వచ్చి, ఊచలు పట్టుకుని నిలబడిచూసింది. పిచ్చి నవ్వొకటి వికృతంగా నవ్వింది "ఆ! నాకు తెలుసు నన్నెవరు పిలుస్తున్నారో. జిప్సీ! జిప్సీ నన్ను పిలుస్తోంది."

ఇంతలో చౌకులోని కొఱత ఆమె కళ్లబడింది. పిచ్చి ఆవేశంతో కేకలు వెయ్యనారంభించింది. చేతులు ఊచలలోనుంచి బైటకు చాచింది. "పిల్ల నెత్తుకుపోతారా? చావండి! మీ కింతే శాస్తి. కొఱ తెక్కండి. అంటూ వికటాట్టహాసం చేసింది.

## 18

ఆ సమయానికే గ్రీవ్ చౌకులో కొఱతవద్దకు పెద్ద గుంపు చేరింది. ఇక్కడికి సార్జెంట్లు వచ్చారంటే చాలు ఆరోజు అక్కడ పారిస్ ప్రజలకి వినోదమన్నమాటే. ఆరోజు ఉరితియ్యడమో, ఇనప చక్రానికి కట్టి తిప్పడమో, కొఱతవెయ్యడమో, కొరడాలతో కొట్టడమో, లేక చెవు లూడగొట్టడమో జరుగుతుందన్నమాట. గుర్రాలపై సార్జెంట్లు చేత కొరడాలు పుచ్చుకుని అదలిస్తూ జనాన్ని అదుపులో ఉంచుతున్నారు.

దోషిని ఒక బండిమీద కట్టేసి తీసుకువచ్చి కొఱ తెక్కించారు. అక్కడ క్వాసిమోడోని గుర్తుపట్టగానే జనం అందరూ ఒక్కసారి గొల్లుమన్నారు. కిందటి రోజు 'మూర్ఖాగ్రేసరుడ'ని ఊరేగించినవాణ్ణే ఇవాళ కొఱతవేస్తోంటే చూసి ఆ జనమే వినోదిస్తున్నారు. ఈ విచిత్రతత్వాన్ని విచారించేందుకు కవి గ్రింగైర్ లేకపోయాడు. ఒక పురపాలకాధికారి వేదికనెక్కి నిలబడగానే అంతటా నిశ్శబ్దం అలుముకుంది. దోషికి విధించబోయే శిక్ష బిగ్గరగా చదివి అతను దిగిపోయాడు.

క్వాసిమోడో కదల్లేదు, మెదల్లేదు. చివరి కతని ముఖంలో కోపమైనా కనపడ్డంలేదు. కట్టినగొలుసుల్తో పెనగులాడ్డం వ్యర్థమని గ్రహించాడు. సిపాయిలు గుంజి గెంటినా ఊరుకున్నాడు. కర్రలతో పొడిచినా ఊరుకున్నాడు. ప్రజ్ఞ పూర్తిగా లోపించిన అతని ముఖంలో నిశ్చేష్టభావంతప్ప మరొకటేదీ కనపడదు. అతను చెవిటివాడే కాదు; గుడ్డివాడుకూడా అనిపిస్తుంది. ముందు అతన్ని గొలుసులుతీసి కొఱతపక్కన మోకాళ్ళపై నిలబెట్టారు. పైచొక్కా తీసివేశారు. పెద్దమూపు ప్రజలకంట బడింది. మళ్ళీ అతన్ని అలా గొలుసులతో కట్టివేశారు. కాళ్లు పట్టుకు వేలాడదీస్తే తల వేలాడుతుంటే కష్టంతో నిశ్వాసం విడిచిపెట్టేదూడలా గాఢనిశ్వాసం విడుస్తున్నాడు.

"బండయెద్దు" అన్నాడు జెహాన్ ఫ్రొలో గుంపులోనుంచి.

ఒకడు వచ్చి గంటలు కొలిచే జంటసీసా కొఱత పైన పెట్టాడు. పై సగం సీసానిండా ఎర్రని ఇసుక ఉంది. అది మెల్లి మెల్లిగా కింది సగం సీసాలోకి జారిపడుతోంది. మరొకడు వచ్చి కోటు చేతులు మడుచుకున్నాడు. అతని చేతిలో కొరడా ఉంది. దట్టమైన తోలు పటకాలో సీసపు ముక్కలు అతికించి ఉన్నాయి. మెల్లిగా చక్రం తిరగడం మొదలుపెట్టింది. క్వాసిమోడో భయంతో వొణికాడు. అప్పుడతని ముఖంచూసి జనం విరగబడి నవ్వారు. చక్రంపైన క్వాసిమోడో ఒక చుట్టు తిరిగాడు. తిరిగి వేదికవద్దకు వచ్చేసరికి అతని మూపుపైన కొరడా ఛెళ్లుమంది.

క్వాసిమోడోకి ఒక్కసారి కలలోనుంచి మేలుకున్నట్లయింది. గొలుసులతో పెనగులాడ్డం మొదలుపెట్టాడు. బాధవల్ల అతని ముఖం మరింత వికృతమయింది. తల అటూ ఇటూ తిప్పడం మొదలుపెట్టాడు. చక్రం తిరుగుతోంది. కొరడా ఛెళ్లు ఛెళ్ళున అతని వీపు బద్దలుగొడుతోంది. వీపుపై వందగాయాలనుంచి రక్తం చిమ్మనారంభించింది. పాముపడగలవలె కొరడా సీసపు ముక్కలు ఆకాశంలోకి లేచి విసురుగా మూపుపైన పడుతున్నాయి. పైకి లేచినప్పుడల్లా రక్తపు చినుకుల్ని గుంపుపైకి కురిపిస్తున్నాయి.

క్వాసిమోడో పెనగులాట మానేశాడు. నిస్సహాయంగా గొలుసులలో వేలాడుతున్నాడు. కొంతసేపటికి రక్తం భుజాలపైనుండి కాలువలు గట్టింది. గాయాలను మరింత చీల్చుతున్న కొరడా నెత్తురుమయమైంది. బాధ భరింప శక్యంకానిదయింది. తిరిగి ఒక్కసారి ప్రాణాలొడ్డి పెనగులాడాడు. ఈమాట తని కళ్లలో నిప్పులు కురిశాయి. కండరాలు పొంగాయి. రక్తం మరింత చిందింది. గొలుసులు సాగినాయి. కాని ప్రయత్నం వ్యర్థమని తెలిసిపోయింది.

 ఘంటారావం 

నిరాశతో మళ్లీ పెనగులాట మానుకున్నాడు. మత్తు కమ్మినట్లయింది. ఒక్క కన్నూ మూసుకున్నాడు. సత్తువ చెడి తలవాల్చేశాడు.

తరవాత అతను కదల్లేదు. కొరడా శరీరాన్ని చీల్చి వేస్తోంది. రక్తం కాలవలై ప్రవహిస్తోంది. కొట్టిన కొద్దీ కొరడా రోషం ఎక్కువౌతోంది కాని అతనిలో మాత్రం చలనం రాలేదు.

కొంతసేపటి కొకడు గంటలుకొలిచే జంటసీసావంక చెయ్యి చూపాడు. కొరడా ఆగిపోయింది. చక్రం నిలిచిపోయింది. మెల్లిగా దోషి కన్ను తెరిచాడు. ఇద్దరు వచ్చి వీపునున్న రక్తం కడిగివేశారు. ఒకడువచ్చి వీపంతటా మందుపూశాడు. మరొకడు వచ్చి పసుపుపచ్చని గుడ్డఒకటి కప్పాడు. కొట్టినవాడు తోలు పట కాని రెండు వేళ్లమధ్య పిండి నెత్తురు కింద దులిపాడు.

'ఇంతటితో శిక్ష పూర్తికాలేదు. మరొక గంట అతన్ని అల్లా వుంచాలి. అందువల్ల జంట సీసాని తిరగేసిపెట్టారు.

జనసమూహంతత్వాన్ని—ముఖ్యంగా అనాగరికమైన మధ్యయుగాలలో జనం తత్వాన్ని—ఒక కుటుంబంలో పసి కుర్రవానితో పోల్చవచ్చు. బుద్ధి, నీతీ పరిపక్వం చెందని దశలో దాక్షిణ్యం కరువౌతుంది. పారిస్‌లో అందరికీ క్వాసిమోడోపట్ల అకారణ క్రోధం ఉందని ముందే చెప్పబడింది. కొంత వేసినందుకు అక్కడ చేరిన అందరికీ ఆనందమే కలిగింది. జరిగిన శిక్ష అందరికీ వినోదం కలిగించడంతో పోలేదు. నిస్సహాయస్థితిలో ఉన్నందువల్ల అతనిపై కోపం హెచ్చయింది.

అందువల్ల అధికారులవంతు శిక్ష పూర్తయిన తరవాత ప్రజల వంతు వచ్చింది. ఇక్కడకూడా ఆడవాళ్ళదే పై చెయ్యి. అందరూ బిగ్గరగా దూషించ నారంభించారు. కొందరు రాళ్లుకూడావిసిరారు.

క్వాసిమోడో చెవిటివాడే కావచ్చు. కాని ఉన్న ఒక్క కన్నుతోనే చూసి పరిస్థితిని సూక్ష్మంగా గ్రహించగలడు. అయితే అతని భావం మాటల్లోకంటె ముఖంలో ఎక్కువ వ్యక్తమౌతుంది. అందరినీ ఒక్కసారి మింగివేసేలా చూశాడు. కాని రాళ్లు మరిన్ని మీదకు వచ్చి పడ్డాయి. గొలుసుల్లో పెనగులాడాడు. చక్రం గజగజలాడింది. కాని దీనివల్ల ప్రజలకు వినోదమే ఎక్కువ కలిగింది.

పెనగులాడి చేసేదిలేక చివరికి కూరుకున్నాడు. ఇటువంటి శిక్షవల్ల ఇతరులకువలె ఇతనికి లజ్జమాత్రం కలగలేదు. క్రోధం అధికమయింది. లజ్జ అంటే ఏమిటో తెలుసుకునే సామాజిక చైతన్యం లేదతనికి. రోషమొక్కటే అతన్ని నిలువెల్లా దహిస్తోంది.

అతనిదృష్టి అప్పుడే వస్తున్న ఒక గుర్రంపైన పడింది. ఆ గుర్రం పైనున్నవాడు క్లాడ్ ఫ్రొలో. అతన్ని చూడగానే క్వాసిమోడో ముఖంలో రోషం అంతరించింది. క్లాడ్ ఫ్రొలో సమీపించగానే క్వాసిమోడో చిరునవ్వు నవ్వాడు. కాని దగ్గరకువచ్చి చక్రంపై క్వాసిమోడోని గుర్తించగానే క్లాడ్ ఫ్రొలో తల వంచుకున్నాడు. గుర్రం గుంపులోనుంచి దారితీసింది.

క్వాసిమోడో ముఖంపై నల్లని ఛాయ ఆవరించింది. ఆశాభంగం, నిస్పృహ, విషాదభావాలు అతనిముఖంలో గోచరించాయి.

గంటసేపు ప్రజల అవహేళన, నిర్దాక్షిణ్యవర్తన సహించాడు క్వాసిమోడో. చివరకు భరించలేక మరొకసారి పెనగులాడాడు. "నీళ్లు" అని బిగ్గరగా అరిచాడు. ఇది సింహం గర్జించినట్లుంది. ఈమాట వినగానే ప్రజలకి జాలికిబదులు మరింత వినోదమే కలిగింది. దూషించేవారేకాని నీళ్ళివ్వడానికి ప్రయత్నించినవాళ్లే లేరు. క్వాసిమోడో ముఖం, తలా చెమటలో తడిసిపోయింది. దాహంతో నోరెండి నాలుక చాచి చెమట బిందువులందుకోవడం మొదలుపెట్టాడు. ఆయాసంలో గట్టిగా వగర్చుతున్నాడు. ప్రజల ఈ అమానుషవర్తనపట్ల అతనిక్రోధం హద్దులు దాటింది. కంట నిప్పులు చెరుగుతున్నాడు. గుంపువంకా ఒకసారి కలయచూశాడు. మళ్ళీ ఒకసారి 'నీళ్ళు' అని అరిచాడు. ప్రజలు వెటకారంతో 'నీళ్ళు' అని అరిచారు. ఒకామె పెద్ద రాయి విసిరింది. అది అతని తలకుకొట్టుకు కూలిపడిపోయింది. ఒకడు ఓటికూజా విసిరాడు. అది అతని రొమ్ముకు తగిలి ముక్కచెక్కలైపోయింది.

"నీళ్ళు" అని మళ్ళీ బొబ్బపెట్టాడు. ఇంతలో గుంపు దారిచ్చింది. తెల్లని మేకని వెంటపెట్టుకుని ఎస్మరాల్డా వచ్చింది. ఆమె చేతిలో తంబుర ఉంది. క్వాసిమోడో ఆమెని గుర్తించాడు. తను అపహరించడానికి ప్రయత్నించింది ఈమెనే. ఇందుకే తనకీ శిక్ష కాబోలునని ఇప్పుడతనికి తోచింది. కాని తన శిక్షకి కారణం తనకీ న్యాయమూర్తికీ కూడా ఉన్న చెవుడేనని అతనికి తెలియదు. తనపై పగ తీర్చుకోడానికి ఆమె వస్తోందనుకున్నాడు. ఆమెను జాగ్రత్తగా గమనించాడు. అతని కన్నులో కోపం ఉట్టిపడుతోంది. ఆ కంటికే శక్తిఉంటే ఎస్మరాల్డా అప్పుడే భస్మమైపోయేది. మెల్లిగా ఆమె అతన్ని సమీపించింది. ఆమెను చూడలేక ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. ఆమె తన వీపుపై సంచిలోనుంచి ఒక సీసా తీసింది. ఒక్కమాటైనా పలక్కుండా సీసా అతని పెదవులపై వంచింది. కరకర కాలిపోతున్న అతని నాలుక నీటిని చప్పరించింది. అతని ముఖంలోని భావం ఇట్టే మారిపోయింది. కంటి చివర ఒక పెద్ద నీటిబిందువు నిలిచింది. వికృతమైన ఆ ముఖంపైనుండి మెల్లిగా ఆ బిందువు జారి పడిపోయింది. పెద్దవాడై సత్తువ వచ్చినతరువాత అతను కంట నీరు నించడం ఇదే మొదటిసారి.

కృతజ్ఞతాభావంతో అతను నీరు త్రాగడం మరిచిపోయాడు. ఆమెకు చిరాకు కలిగింది. సీసా అతని నోటి కందించింది. వెంటనే నీరు త్రాగేశాడు. పూర్తికాగానే కృతజ్ఞతాభావంతో ఆమె ముఖమండలాన్నొకసారి వీక్షించి తలదించుకున్నాడు. పెదవులు చాచి ఆమె పాదాలు స్పృశించబోయాడు. కాని గడిచిన రాత్రి అనుభవం జ్ఞప్తికివచ్చి కాబోలు ఆమె వెనక్కు అడుగువేసింది. భయంతో అతని దగ్గరనుంచి తొలగిపోయింది. ఆత్మనిరసన, వ్యధ అతని హృదయాన్ని గాయపరిచాయి.

సరిగ్గా ఇదేసమయంలో సిస్టర్ గ్యూలా కిటికీలోనుంచి కొంత వట్టి దృశ్యం చూసింది. చూసి జిప్సీ యువతిని శపించ నారంభించింది. కోపంతో పళ్లు పటపటకొరికింది. అదే సమయానికి ఎస్మరాల్డా గుంపులోనుంచి వచ్చి సమాధి సమీపించింది. సిస్టర్ శాపనార్థాలు వినేసరికి ఆమె హడలిపోయింది. "పిల్లల్ని ఎత్తుకుపోయే పాపిష్టులు! నరకం పాలౌతారు మీరు. నీకూ ఈ కొంతే రాసివుందిలే" అంటోంది సిస్టర్. ఈ మాటలు ఎస్మరాల్డా చెవుల్లో గింగురుమంటున్నాయి.

చెదిరి వెళ్ళిపోతున్న జనం సిస్టర్‌ని చూశారు. "మళ్ళీ ఈవిడకి పిచ్చెత్తింది కాబోలు" అన్నారు కొందరు.

శిక్ష పూర్తికాగానే క్వాసిమోడో బంధవిముక్తుడైనాడు. జనం అందరూ వెళ్ళిపోతున్నారు. రీమ్స్‌నించి వచ్చిన వనిత కొడుకుని దగ్గరకు తీసుకుంది. చూసి ఆశ్చర్యపడింది. "అరే చేతిలో రొట్టేదిరా?" అని అడిగింది.

"నువ్వు కిటికీలో ఆవిడతో మాట్లాడుతున్నప్పుడు పెద్ద కుక్కొకటొచ్చిందమ్మా. నాచేతులో రొట్టె అందుకుని సగం కొరికేసింది. ఇంకెందుకని మిగిలింది నేను తినేశాను."

"అంతా తినేశావే?"

"నేను కాదమ్మా! కుక్క!"

(ఇంకావుంది)

ఉండి ఉండి అనుకోకుండా విశ్వపతి గారి అయిదో అమ్మాయికి పెళ్ళి సంబంధం స్థిరపడ్డది.

"అమ్మయ్యా! ఎన్నాళ్లకి..." అని కొందరు బరువు దించుకున్నట్లు తేలిక పడ్డారు. ఆమె పెళ్ళిని గురించి వింటూ విసుగెత్తి "ఇక పెళ్లికాదు ఆ పిల్లకి..." అన్నవాళ్ళు "మూడుముళ్ళూ పడాలి, అనుకోవాలి" అనే సందేహం వెలిబుచ్చారు.

విశ్వపతి తన చేతిమీదుగా నలుగురు కూతుళ్లకీ, ఇద్దరు కొడుకులికీ నిరాఘాటంగా పెళ్ళిళ్లు చేశాడు. ఒక కూతురికీ, ఒక కొడుక్కీ అయిదురోజుల పెళ్ళిళ్ళుకూడా చేశాడు. అందుకు ఆయన నిజంగా ప్రశంసార్హుడే.

ఐతే ఆఖరిపిల్ల మోహిని (అసలు పేరు జగన్మోహిని) పెళ్లికోసం పడ్డ కష్టాలకు తను కనకే ఆగాడు; మరొకడెవడైనా ఐతే తారెత్తుకుపోను, అని విశ్వపతి భావించడంలో కొంతైనా యధార్థం లేకపోలేదు. బ్రహ్మకైనా విసుగుపుడితే పట్టు సడలిపోవడం ఘనం కాదన్నప్పుడు 'ఏటమిక్ ఏజ్'లో పెళ్ళిళ్ల సంసారాన్ని ఈదుతున్న విశ్వపతిగారు ఒక లెక్క కాదు. సంపాదన విషయంలో మాత్రం ఆయన అసామాన్యుడు అని లోకం గుర్తించింది. నిదానించి చూస్తే మోహినికి పెళ్ళిసంబంధాలు తేవడంలో విశ్వపతికి ఎన్ని జోళ్ల జతలు అరిగాయో ఒక లెక్క కానేకాదు. కాలేజీ విద్యార్థులే ఆమెకోసం తిరిగి తెలియకుండా అరగగొట్టుకున్న ఖరీదైన బూట్లే ఎక్కువ. అప్పట్లో మోహిని ఏ కుర్రాడితోనూ ఏ 'సాహసికయాత్ర' సాగించక పోవడమే విశ్వపతిగారి కిప్పుడింత అవస్థ." అని ఎవరైనా నవ్వుతూ అనందించవచ్చు. అంతమాటే...! కళ్ళు పోతాయి. సాంప్రదాయకమైన కుటుంబాల్లో అట్లాంటివి ఎక్కడైనా జరుగుతాయా!

కాలేజీలో చేరిన కొత్తలో మోహిని తమని గుర్తించాలనీ, వీలైతే తమతో మాట్లాడాలని, ఆమె నాకర్షించాలని ఎన్నో శాస్త్రీయ అశాస్త్రీయ కళాత్మక ప్రయోగాలతో ఎందరో వ్యర్థ ప్రయత్నాలు చేశారు. ఆ పిల్లతో ఏ విషయం మాట్లాడాలన్నా కుర్రవాళ్ళకు భయం. అయితే "నిన్ను ప్రేమిస్తున్నాను. నన్ను పెళ్ళి చేసుకో మోహినీ" అని ఆమెనే ముఖాముఖీ అడగగలిగే దమ్ము, ఆ పిల్ల క్లాస్‌లో విశేషించి ఆ కాలేజీ కుర్రాళ్లలో ఎవరికి గాని ఉంటుందని మనం ఆశించడం పొరబాటు.

కొద్ది రోజులు చూసి మారు పేర్లతో కుర్రాళ్ళు కొందరు యథాశక్తి 'ప్రేమలేఖలు' పంపించారు. ఆ పిల్ల తన తెలివి అంతా వాళ్లదగ్గరే ప్రదర్శించాలన్నట్లు, ఆ ఉత్తరాలకేమీ చలించకపోగా, తనకలాంటి ఉత్తరాలే రానట్లు, ఏ సంగతీ వెల్లడించకుండా తిరగ నారంభించింది. నిజానికి నవలల్లోనూ, నాటకాలలోనూ, సినీమాలలోనూ ప్రేయసీప్రియుల మధ్య నడిచే



## చామర్తి కనకయ్య



ప్రేమోపన్యాసాలు వాస్తవ జీవితంలో ఎక్కడా జరగవు. ఉభయులూ ప్రేమించుకొంటున్నారనే సహజమైన భావం పాఠకుల్లోనూ, ప్రేక్షకుల్లోనూ కలిగించేందుకు రచయితలు ఎంతో శ్రమపడి ఎన్నో అసహజమైన ఉపన్యాసాలిప్పిస్తారు. ఇందరిని కలవరపెట్టే మోహిని-పుష్పసమనాస; ముకురకపోల; సింహమధ్య; నాళీకనేత్ర. ఇవేమీ కాదు; అభ్యుదయ కవులు పోల్చే 'ట్యూబ్ లైట్' కాదు. కాని మొత్తంమీద ఓ చక్కని 'తురపుముక్క' - సందేహం లేదు.

ఆనాడే తండ్రితో మోహిని తనకువచ్చే మెయిల్ చెవిని వేసిఉన్నట్లయితే ఇంత కాలం పెళ్ళి ఆగిపోకపోనేమో! విశ్వపతి అంగీకారంతో ఏదో ఒకటి స్థిరమయేదేమో! అవేమీ జరగలేదు. కథ పెరిగే అవకాశమున్నప్పుడు జరగవలసినవి సవ్యంగా ఎందుకు జరుగుతై? అందుకే కథయి ఊరుకుంది.

ఇంటర్మీడియెట్ పరీక్షలో ఒక పార్టు మిగిలిపోవడం, మళ్ళీ మూడో ఛాన్సు కు కాని వచ్చి చెడి చాయంగల విన్నపాలతో కడతేరలేకపోవడంతో మోహినికి అయిష్టం ప్రబలి చదువుకు స్వస్తివాచకం పలికి ఇంటి దగ్గరే కూర్చోవడం, తండ్రిచేసే పెళ్ళి ప్రయత్నాలకు బలమైన నాందిఅయింది. అయితేనేం కొన్నిరోజులు పెళ్ళిచేసికోనని మోహిని భీష్మించింది. చదువూ లేక, పెళ్ళీ లేక, ఊరికే మోహిని ఉండిపోవడం తలిదండ్రులకు చాలా అన్యాయంగా తోచింది. భారతదేశంలో సంసారుల కుటుంబాలలో ఆడపిల్లగా పుట్టినవాళ్లలో చాలమంది పెళ్ళిచేసికొని పిల్లల్ని కనవలసిన గురుతరమైన సాంఘిక బాధ్యత తప్పని సరియై ఉండగా, దానిని కాదనే శక్తి మోహిని కెక్కడనుంచి వస్తుంది? అది గుర్తించిన మోహిని అంగీకారంతో పెళ్ళి కొడుకులను చూసింది.

తెలివైనపిల్ల కనక పెళ్ళిచూపులకొచ్చిన ఘనాపాఠీలైన క్రాస్ ఎక్జామినర్లని చిత్తు చేసింది. కొందరు నిగమశర్మ శిష్యులుకూడ తిరస్కరించబడ్డారు. తల్లీ తండ్రీ నెత్తీ నోరూ బాదుకొన్నారు.

మోహినికి తీరా నచ్చిన చలాకీ, నాజూకు కుర్రాళ్లు, బుద్ధిమంతులు మొత్తం మీద కట్నాల విషయంలో నైతేనేం, వాళ్ళకి విశ్వపతిగారు బూర్జువాలా కనిపించడంచేత నైతేనేం, పిల్ల అన్నగార్లకున్న రాజకీయాభిప్రాయాలు తమకు నచ్చక నైతేనేం - కొన్ని సంబంధాలు తమ దారి తాము చూసుకొన్నాయి.

ఇన్ని అడ్డంకులు ఎదురవడంతో ఏ సంబంధం నిశ్చయం కాక, మోహిని పెళ్లిని గురించి వెలువడే వార్తల్లో క్రమంగా పస చచ్చిపోయింది. ఇరుగు పొరుగులు 'బూరిముక్క కోసం' ఆశతో ఆ విషయం కదిపినా విసుగెత్తి పూర్వం చూపిన ఉత్సాహం, శ్రద్ధ ప్రదర్శించడం మానుకున్నారు.

విశ్వపతికి చాలా చీదర అనిపించింది. మోహినికికూడ చాలా నిరాశ అయింది. తనమీద తనకే జాలిపుట్టి ఎప్పుడైనా ఏడ్చేదేమో! విశ్వపతిగారు పిల్ల పెళ్లిప్రసక్తి ఎక్కడా రానివ్వడం మానేశాడు. కొత్తలో తనని తను తిట్టుకొనేవాడు. ఏ సంబంధంలేని భార్యను తిట్టేవాడు. మోహినిని దుమ్మెత్తిపోసేవాడు. ఎవరైనా మాటవరసకి మోహిని పెళ్ళినిగూర్చి తల పెడితే "ఘటన ఎప్పుడుంటే అప్పుడవు

తుంది. కళ్యాణ మొచ్చినా కక్కొచ్చినా ఆగదు కదా" అని మొండి వేదాంతం ప్రారంభించేవాడు. కాని మోహిని తల్లి ప్రాణికి పిల్లపెళ్ళి వెనక్కి వెళ్లేకొద్దీ తొందర హెచ్చు కాసాగింది. అసలు, పిల్లకి పెళ్లే కాదేమో అని ఆమె భయం.

సమయం చూసుకొని నిత్యకృత్యాల్లో విశ్వపతిగారిని మోహిని పెళ్ళి విషయం తల్లి 'రిమైండ్' చేస్తూనేఉంది. ఆయన మొదట కొన్నాళ్ళు "ఘటన ఉండాలి" అనేవాడు. తరవాత "అదే అవుతుంది" అనేవాడు. ఏ సమాధానం చెప్పకుండా నిశ్శబ్దంగా తల ఊపిన రోజులుకూడా ఉన్నాయి. ఎన్ని అనుభవాలు తలమీద కొట్టి చెబుతున్నా చచ్చి బ్రతుకుతూ, బ్రతికి చస్తూ కూడ ఏ కొంచెమో ఆశతో మానవుడు జీవిస్తున్నాడు. విశ్వపతిగారు ఓటమికి తలవొగ్గి గోళ్లు గిల్లుకు కూర్చోడు. ఓడిపోయినవాడికి పౌరుషం ఎక్కువ. ఆయన ఏ విషయం భార్యలాగ తేలిపోడు. ఆ విషయంగూర్చి తను ఆలోచిస్తున్నట్టు ఆయన పైకి చెప్పలేదు కాని, భార్యకన్న ఎక్కువ మెలకువగా ఉన్నాడు. కొన్ని అనుభవాలతర్వాత కొందరిలో కొన్ని చిత్రమైన మార్పులు చూస్తాం. ఒకరోజు విశ్వనపతిగారు సరదాగా కబుర్లు చెబుతూ కాఫీ 'సిప్' చేస్తున్న సమయంలో ఆ ఇల్లాలు అన్నదికదా: "చూడండి. సుదర్శనమ్మగారి సుబ్బులుకి ఎంత మంచి సంబంధం వచ్చిందో. కట్నాలిచ్చుకొనే తాహతు లేకపోయినా అత్తపోరు, ఆడబడుచు పోరు లేని మంచి స్థితిగల సంబంధం."

దానికి విశ్వపతి చటుక్కున మారిపోయి నిర్లిప్తంగా - "అంతే! అదృష్టం" అన్నాడు.

మన పిల్లకి కూడ అట్లాంటి చక్కటి సంబంధం వస్తే బాగుండునని విశ్వపతి అంటాడేమో, విందామని ఆ 'తల్లి' కూర్చున్నది. పాపం!

కాని మోహినికి పెళ్ళి అయే అదృష్టమే ఉంటే సంబంధాలు దొరక్క ఏమౌతాయి? విశ్వపతి ఇంటికి ఒక రోజున దూరపు బంధువు ఒకాయన పనికట్టుకొని వచ్చినట్లు వచ్చి ఒక సంబంధం చూపించి వెళ్ళాడు. తాంబూలాలు పుచ్చుకోవడం అయిన తర్వాత విశ్వపతి కుటుంబం బెంగ పెట్టుకోవలసిన అవసరం ఏం లేదు. పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించారాయెను.

అయితే జాతకాలు పరిశీలిస్తే పెళ్లికూతురు పెద్దపులి, పెళ్ళికొడుకు మేకపిల్ల అయినట్లు రూఢిగా మొగపెళ్ళివారికి తేలిందని, "కుర్రవాడికి పెళ్ళి కాకపోతే పోయింది, ఇట్లాంటి పెద్దపులిపిల్లను ఎరిగివుండి భరించలే"మని అన్నట్లు తెలియరావడంతో విశ్వపతిగారు, భార్య విడివిడిగా ఆత్మహత్య... ......చేసికొనేవారే, గాని చేసికోలేదు, పెళ్ళి చూచే యోగ్యత ఉండగా అదెట్లా సంభవం? అయినా కొందరు పెళ్ళిళ్ళు చూడడానికే అనిపించేట్లు ఎన్నాళ్లైనా బ్రతుకుతూనే ఉంటారు.

'జీవితమొక క్షణికోన్మాదం'అనే పరమ వేదాంతసత్యాన్ని చాలామందికిమల్లె విశ్వపతిగారుకూడ అవసరం వెంబడి అనుభవంలోకి తెచ్చుకొని విరక్తిమార్గం అవలంబించారు. ఆ సంబంధం హఠాత్తుగాతిరిగి పోవడానికి కారణం 'జాతకం' అయి ఉండదని విశ్వపతిగారు ఊహించినవాడై, ఆ విరక్తిదశలోనే కొంచెం కట్నం అంకె పెద్దదివేసి చెప్పాడు. ఆ ముహూర్తానికే చాలా తక్కువ కట్నంతో ఆకుర్రవాడు ఇంకో అమ్మాయితో ఓఇంటివాడయాడు.

ఎంత అవమానం...!

ఇట్లాంటి సంబంధాల్ని చాలా అసహ్యం ప్రపంచానికి - విశ్వపతికి.

తన ప్రయత్నంవల్లనే ఇన్నిసార్లు ఇలా అయింది.

అయితే అవును. కాకపోతేకాదు. తనెందుకు సిద్ధపడాలి?

సిద్ధపడెనుబో, ఇంత తలవంపులైనపని ఎందుకు జరగాలి?

ఈ ప్రశ్నలు తనని పదేపదే వేసికొని జవాబులు ఇచ్చుకోలేక 'విధి'ని కూడ వీలైనంతలో అవే ప్రశ్నలతో జవాబుకోసం వేధించాడు. మోహినికి తన మీదకన్న, ప్రపంచంమీద కన్న! తనని ఇంకోలా గాయపరచిన ఆ మగపెళ్లివారిమీదకన్న, తండ్రి విశ్వపతిమీదనే ఎక్కువ కోపం.

తనలోఉన్న లోపం ఏమిటి?

ఈ ప్రశ్న వేసికోవలసిరావడం ఎంత చిన్నతనమో మోహినికి బాగాఅర్థం కాకపోయినా, ఎప్పుడూ కలగక ఇప్పుడే ఆ సందేహం కలగడం ఆమెకేదో పెద్ద భయంగా ఉంది. ముఖ్యంగా విశ్వపతిగారికి భార్యకున్న గొప్ప భయమల్లా, 'పిల్లలో ఏదో లోపం ఉండడంచేతే సంబంధాలు తిరిగిపోతున్నాయి' అనే అనుకుంటారని. తరవాత మోహినిపెళ్లిగురించి ఎవళ్లకి తోచినట్లు వాళ్లు అనుకున్నారు. ఉంటే ఆ దేవుడికే తెలియాలి నిజం.

తను లక్షణంగా పెళ్ళిచేసికొందా మనుకుంటే - ఇవేం విఘ్నాలు? అదో బాధ

మోహినికి. తను ఎందుకు చదివినట్లు? చదివిన చదువుకి ప్రపంచంలో మారలేనేమో అనే అధైర్యం ఆ పిల్లకిలేదు. ఆ పిల్ల చదువుకి 'ఉద్యోగం' ఉద్దేశంకాదు. మోహిని లాంటి పిల్లలకి ఎంత చదువు చదివినా చివరకి న్యాయంగా జరగవలసింది వివాహం వినా మరొకటిలేదు.

ఆ ఇంట్లో అందరికీ 'మోహిని పెళ్ళి' విషయమే పట్టుగావుంది. ఈసారి కథ మంచి మెలకువలతో సాగింది. ఏ సంఘటన జరిగినా పాపం! విశ్వపతిగారి మేలుకోసమే జరుగుతున్నప్పుడు ఆయన ప్రయత్నం లేకుండానే మళ్ళీ మోహినికి 'పెళ్ళివారు' రావటంలో మనం ఏమీ ఆశ్చర్యపడక్కరలేదు. తన తాహతుకు తగిన సంబంధం అనే విషయం విశ్వపతికి తట్టేసరికి అంత క్రితం ఆయనలో పాదుకొనిఉన్న 'వేదాంతం' అంతా ఎగిరిపోయిందో!

'కీడెంచి మేలెంచాలి' గనక ఎటువచ్చి ఎక్కైనా బాధ ఉండదనే ఉద్దేశంతో ఇలా పెళ్ళివారొచ్చారు మోహినికి అనే సంగతి పైవాళ్ళెవరికి తెలియకుండా విశ్వపతి కట్టుదిట్టాలు చేసికొన్నాడు. అన్నీ స్థిరపడి సవ్యంగా జరిగేవరకూ పెళ్ళిసంగతి 'ఎవరితోనూ చెప్పను' అని ఆయన భార్యచేత చేతిలో చేయి వేయించుకున్నాడు.

మోహినికి పెళ్ళికొడుకు నచ్చాడు ఆసైన్సు ఆనర్సు చదివే కుర్రాడికి మోహిని నచ్చింది. పెళ్ళికొడుకుతండ్రి గెజెటెడ్ ఆఫీసర్ హోదాలో డబ్బు గడిస్తున్నాడు ఒక్కడే కొడుకు. ఉభయుల జాతకాలు బాగానే ఉన్నాయి అంతవరకూ. కొద్ది తేడాలో కట్నాల విషయంకూడా ఫైసలు అయిపోయింది. ఇంకేముంటుంది సంబంధం నిశ్చయమైంది, ముహూర్తనిశ్చయంకూడా అప్పుడు అయిపోయేది కాని అక్కడె ఆ సమయానికి ఆడవాళ్ళకేమైనా అటంకమేమో చూసికొని తిరిగి నాలుగురోజుల్లో కబురుచేస్తాను, పురోహితుణ్ణికూడా కనుక్కొని వ్రాస్తానుగనా, అని పెళ్ళికొడుకు విశ్వపతికి కాబోయే వియ్యంకుడు. దూరంలోఉన్న కొడుకులకీ, కూతుళ్ళకీ పెళ్ళి నిశ్చయం అయినట్లు, ముహూర్తం త్వరలో నిశ్చయిస్తామన్నట్లు ఉత్తరాలు ప్రవహించినై. చాలా దగ్గరలోనే ముహూర్తం నిశ్చయించుకోవాలని విశ్వపతిగారు, భార్య తొందరపడ్డారు.

ఆరు రోజులు గడిచాయి.

పనిమనుష్యులచేత, మోహిని తల్లితో కూడా కూడా ఉండి 'పసుపు' కొట్టిస్తొంది. విశ్వపతిగారు ఇంట్లోకి కంగారుగా వచ్చి ఏదో చెప్పబోయాడు.

"ఏమండీ! ఏం జరిగింది!...ఏమిటేది?"

"........................"

"ఏమిటి నాన్నగారూ! ఏం జరిగింది" - మోహినికి ఏమిటో తెలియని తొందర.

"ఆయన...ఆయ నేనే ... గుండె ఆగిపోయినట్టు"—

(53-వ పేజీ చూడండి)

# పదిరూపాయలకోసం

నిష్ఫల బ్రహ్మాజీ

కాఫీనీళ్ళు గొంతుకలో చిలకరించుకుంటూనే ఆఫీసు కాయితాలు చూసుకుందామని వీధి గదిలో దూరాడు దత్తాత్రేయం.

కిటికీతలుపులు తెరిచి చూశాడు. టేబుల్ మీద కాయితాల కట్టలు పడివున్నాయి. అతనికి చిరాకు పుట్టింది. విసుక్కున్నాడు.

వెధవ నౌకిరీ! ఒక్క మూడురోజులు వూళ్లో లేకపోతే సరి; గంపెడు కాయితాలు చాకిరీ చెయ్యమని కాసుకు కూర్చుంటాయి. నానాటికీ పెరగడమే కాని తరగడం వుండదు. అనునిత్యమూ చేస్తూనే ఉండాలి. అందుకనే అతను యేరోజు కాయితాలు ఆరోజే ఫైసల్ చేసేస్తూ వుంటాడు. అవసరమైన వాటిని అతిభద్రంగా డ్రాయర్లో దాస్తాడు. అనవసరమైన వాటిని చించేసి చిత్తుకాయితాల బుట్టలో పడేస్తాడు. ఏమైనా తిలమ్ముకున్నాక యేదో ఒకటి చెయ్యక తప్పుతుందా మరి!

కుర్చీ కొంచెం ముందుకు లాక్కుని బల్ల దగ్గరకు వేసుకున్నాడు. పైమీది కండువా తీసి దుమ్ము దులుపుకుని కూర్చున్నాడు. కాయితాలు ఒక్కొక్కటే తీసి చూడ్డం మొదలెట్టాడు.

రెండు మూడు కాయితాలు ఓపిగ్గా చూసేడు. అక్కణ్ణించి గబగబా పేజీలు తిరగేసి పరపరా చించేయడం మొదలెట్టాడు. "అన్నీ పనికిమాలిన కాయితాలే! పాస్కు కాయితాలే! ఒక్క పైసా అయినా వొచ్చే కాగితం ఒక్కటి అవుపించదు. అన్నీ పిటిషన్లే! అన్నీ అర్జీలే!" అని సణిగాడు.

దత్తాత్రేయానిక్కూడా అందరికి మల్లేనే డబ్బంటే ప్రాణం. పైసా చేతిలో పడితే కాని యేపనీ చెయ్యలేడు. చేతిలోపడ్డ పైసా పైకి పోనివ్వడు. శ్రీదేవి వొస్తే మోకాలు అడ్డం పెట్టడు. అలాంటిది మూడురోజుల క్రిందట శిస్తుల వసూలుకి వెళ్ళి ఖాళీ చేతుల్తో తిరిగి వచ్చాడు. తాపులు మాత్రం తప్పి బయటపడగలిగాడు. రానూ పోనూ ఖర్చులు వ్యర్థమయ్యాయి. ఆ సొమ్ము కొస్తా యెలాగో ఒకలాగ రాబడితేకాని అతని మనసు కుదుటబడదు.

ఇదే ఆలోచిస్తూ క్రమంగా పనిలో లీనమైపోయాడు. కళ్ళు కాగితం వెనుక కాయితాన్ని గబగబా దాటుకుపోతున్నాయి. చేతులు చరచరా కాయితాల్ని అందుకుని పరపరా చింపుతున్నాయి. కిటికీ పూచల్లోంచి చండభానుని కాంతి సూటిగా చొచ్చుకుపోయి కాయితాలమీద ప్రసరిస్తూంది. అతను దీక్షతోనే పని కొనసాగిస్తున్నాడు.

రాధిక ద్వారందగ్గర నుంచుని గదిలోకి తొంగిచూసింది. గదిలో అతనొక్కడే వున్నాడు. లోపలికి ప్రవేశించింది. కాని అతను పనిలో వుండడంవల్ల పలకరించడానికి ధైర్యం చాలిందికాదు. చేతిలో వున్న కవరుపైకి కనుపించకుండా చేతులు వెనక్కు పెట్టుకుని మేజాబల్లముందు నుంచుంది, అతని దృష్టిని ఆకర్షించడానికి.

దత్తాత్రేయం కన్నెత్తి చూడలేదు. ఆమె ఎందుకొచ్చిందో కూడా అడగలేదు. పిటిషను కాగితాన్ని వీరావేశంతో చిత్రవధ చేయడంలో నిమగ్నుడై పోయాడు.

రాధిక మెల్లగా దగ్గింది.

దత్తాత్రేయం కదల్లేదు, మెదల్లేదు. మౌని అయ్యాడు.

ఆమె గాజులు గలగలమని చప్పుడు చేసింది.

ఈసారికూడా అతను కిక్కురుమనలేదు. కాయితాల్ని యింకా జోరుగా కత్తిరిస్తున్నాడు. ఆమె ఇహ సహించలేక పోయింది.

"ఏమిటో పని?" అన్నది.

"ఏదో వల్లకాటిపని." దృష్టి మరల్చకుండానే అతను జవాబిచ్చాడు.

"మీకు నిజంగా మతిపోతూన్నట్లుంది!"

అతను మాట్లాడలేదు. ఆమె మళ్ళీ అందుకున్నది:

"స్నానం చెయ్యరాదూ! ఒళ్లుకొస్త చల్లబడుతుంది."

"ఏదో యేడుస్తాను. నువ్వూరుకో! లేకపోతే పని జరగదు."

విసుక్కున్నాడు.

రాధిక కొంచెం ముందుకు వంగి మోచేతులు బల్లమీద మోపింది. కవరు కుడిచేతి వ్రేళ్ళ సందున యిరికించి, ముఖం అరచేతుల్లో యిముడ్చుకుంది.

"ఎప్పుడూ మీరింతే! ఏదో చిరాగ్గానే వుంటారు" అన్నది తన అనుభవాన్ని తల్చుకుని.

"పోనీ నీకు హుషారుగా వుందికదా!" కళ్లద్దాల్లోంచి కాయితాలు చూస్తూ అడిగాడు.

"కాకపోతే మరేమిటి! కాపరానికొచ్చిన కొత్తలో కాకపోతే పదిమందిని కన్నాక వుండమంటే మాత్రం హుషారుగా వుండగలమూ?" మందహాసం చేసింది రాధిక.

దత్తాత్రేయం తల షికత్తాడు. మేజాబల్లమీద మోచేతు లానుకుని పదివ్రేళ్ల మధ్యని ప్రకాశిస్తూన్న రాధిక మందస్మిత వదనం వికసిస్తూన్న కలువ పువ్వులా అతని కళ్లకు కనిపించింది. ఆమె చెప్పిన చురుకుదనం నిజంగా ఆమె చిలిపి కళ్లలో తొణికిస లాడుతూవుంది.

"రామ! నా సంగతి నీకు తెలీదూ! మనక్కావల్సింది డబ్బు. అదే దొరికితే నేనూ నీకన్న వెయ్యిరెట్లు హుషారుగా వుంటాను" అన్నాడు, తన చిరాక్కు కారణం ధనమే నన్నట్లు.

"డబ్బు...డబ్బు...డబ్బు అంటారు. ఈ సంపాదన మనకి చాలదూ! ఎందుకొచ్చింది హాయిగా వుండక!" ధనం అంటే అయిష్టం కనబర్చింది రాధిక.

ఆ తరవాత ఒయ్యారంగా ఒకసారి ఒళ్లు విరుచుకుని చేతులు దులిపింది. చేతుల్లో వున్న కవరు జారి క్రిందపడింది. దత్తాత్రేయం కళ్ళు పెద్దవి చేశాడు.

"ఆ కవరేమిటి? ఎక్కణ్ణించి వొచ్చింది?"

"ఏం? ఎక్కణ్ణించేనా మీకు రావాలా?"

"రావాలి. విశ్వంభరం దగ్గర్నుంచి."

"అయితే అదే యిదంటారా?"

"అబ్బ! నన్ను చంపక యిద్దు." ప్రాధేయపడ్డాడు.

"ఇది మీ రనుకున్న మనిషి వ్రాసింది కాదు."

"ఏదీ! చూడనీ పోనీ"

"నేను చెబుతున్నాను కదూ!"

"చిలిపితనం మాను రాధా!"

"నిజం. ఇది మా నాన్న దగ్గర్నుంచి వొచ్చింది. చూడండి."
అంటూ కవర్లోంచి కాయితం పైకి తీసి అందించింది రాధిక.

దత్తాత్రేయం గుడ్లు మిటకరించాడు. ముందున్న ఆసక్తి ఆతురత అడుగంటిపోయాయి.

"అబ్బ! నా పనంతా చెడగొట్టేవు రాధ! అనవసరంగా గొడవ చేశావు" అన్నాడు నిరుత్సాహంగా.

రాధిక చిలిపిగా నవ్వింది. దత్తాత్రేయం టేబుల్ మీద తలవాల్చాడు శ్వాసవిడుస్తూ.

"ఏం పూరుకున్నారు? ఉత్తరం చూడరూ!" వెటకారంగా అడిగిందామె.

"చూస్తాలే తరవాత" దత్తాత్రేయం అయిష్టంగానే అన్నాడు.

"కాదు. ఇప్పుడే చూడండి" ఆమె మొండిపట్టు పట్టింది.

"ఏం? విశేషాలేమైనా వున్నాయా?" వుండవనే తలంపుతోనే అడిగాడతను.

"ఉండబట్టే! లేకపోతే మీపని మాను కుని చదవమంటానా?"

దత్తాత్రేయం కాయితం మడతలు విప్పాడు.

టేబుల్ మీద పదిలంగా కవరు పెటింది రాధిక—"అందులో పది రూపాయల నోటు పెట్టి పంపించారు మానాన్న" భుజా లెగరేస్తూ గొప్పగా చాటుకుంది.

దత్తాత్రేయం ఆశ్చర్యపోయాడు. ఉత్తరం ముమ్మారు చదువుకున్నాడు. ఇంకా నమ్మకం చాలక 'నిజంగానా రాధా?' అన్నాడు.

"అయ్యో! ఇంకా నమ్మకం లేదా? కావలిస్తే చూడండి!" అంటూ కవరుపైపు కళ్లి త్రిప్పింది రాధిక.

దత్తాత్రేయానికి అవగాహన కాలేదు. ఉత్తరం మరోసారి చదువుకుని తృప్తిగా నవ్వుకున్నాడు. టేబుల్ మీద వుత్తరం పడేసి యింకో కాయితాల కట్ట తీశాడు. అతన్ని వీధిలోంచి యెవరో పిలిచారు. రాధిక యింట్లోకి వెళ్లిపోయింది. దత్తాత్రేయం చేతుల్లో వున్న కాయితాలు టేబుల్ మీద పడేసి తలుపు తీయడానికి వెళ్ళేడు.

* * *

సాయంత్రం పీసులోకి వెళ్తూన్న భర్తని వెనక్కు పిల్చింది రాధిక—"ఏమండీ! ఓ రెండు గజాలు జార్జెట్ సిల్కు బట్ట తెచ్చిపెటరూ!"

"అబ్బో! చాలా ఖరీదుంటుంది" అన్నాడు దత్తాత్రేయం.

"ఉంటే వుండనీయండి. నాన్న పంపిన సొమ్మే కదా!" రాధిక ఖాతిరీ చెయ్యలేదు.

"ఆఁ. ఇన్నాళ్లకి యెలాగైతేనేం పంపించాడులే మీ నాన్న; పదిరూపాయలు! మిడిసిపడిపోకు." ఎగతాళి చేశాడు దత్తాత్రేయం.

"నేనేం మిడిసిపడలేదు. ముచ్చటపడ్డాను. ఇంతకీ తెస్తారా? తేరా?" అని అడిగింది రాధిక.

"సరే. ఇలాతే ఆ నోటు. తెస్తాను." అన్నాడు దత్తాత్రేయం.

"మీ దగ్గరే వుందికదూ!"

(43-వ పేజీ చూడండి)



# విజ్ఞాన వీధులు

"డాక్టర్"



## 162. నీటిమీది నూనె రంగులు

"నూనె పదార్థములు నీటిపై పడినప్పుడు రంగు రంగులతో వ్యాపించును. ఎందుచేత?" అని తిల్లపూడినుంచి ఇ. తుకారాంగారు అడుగుతున్నారు. దీనిని వివరించాలంటే చాలా చెప్పాలి. క్లుప్తంగా చెప్తాను సావధానంగా వినండి. ఒక పళ్లెములో ఒక మూల నీటిబిందువుల్ని ఒకటొకటిగా విడిస్తే, తరంగాలు పుట్టునని అందరికీ తెలుసును. ఇప్పుడు ఇంకొకచోట కూడా ఇలాగే బిందువులు పడే యేర్పాటుచేస్తే అక్కడ బయల్దేరే తరంగాలూ, ఇక్కడ బయల్దేరే తరంగాలూ పరస్పరం ఎదుర్కొంటాయి. నదీస్నానము చేసేవారికి, తరంగాలవల్ల తేలే వస్తువులు పైకి కిందికి ఊగుతాయిగాని ముందుకు అంతగా కదలవని తెలుస్తుంది. ఈ పళ్లెములోని నీటిమీది తరంగాలు కూడా తేలే ఆకుముక్కల్ని పైకి కిందికి ఊగిసలాడిస్తాయని కూడా మనము ప్రయోగముచేసి గుర్తించవచ్చును.

ఇది గుర్తిస్తే తరవాతి కథ సులభమే. పళ్లెములోని నీటిలో రెండుచోట్లకదా తరంగాలు పుట్టిస్తున్నాము? ఈ రెండు చోట్ల పుట్టే తరంగాలు ఒక చిన్న ఆకు తునకకడ తారసిల్లిన వనుకుందాము. రెండో తరంగాన్ని మరిచిపోతే, మొదటి తరంగము ఆ ముక్కని పైకి ఎత్తే స్థితిలో అక్కడికి చేరిన దనుకుందాము. రెండో తరంగము ఈ ముక్క దగ్గరకే చేరినప్పుడు ఆ ముక్కని ఎత్తే స్థితిలో వుంటే, ఈ రెండుతరంగాలా కలయికవల్ల ఆ ఆకుతునక ఇతోధికంగా పైకి తూగుతుంది. ఒకవేళ గాని ఒక తరంగము పైకి ఎత్తబోయి, రెండోతరంగము కిందికి దింపబోతే, రెండింటి ప్రభావమూ చెల్లిపోయి ఆ ఆకుముక్క కదలనే కదలదు. ఈ రెండు తరంగాలా తాకిడి జరిగేచోట్ల ఇలాగ కదలని చోట్లూ వుంటాయీ, ఇతోధికంగా కదిలే చోట్లూ వుంటాయి.

వెల్తురన్నది అవకాశములో తరంగాల వల్లనే వ్యాపిస్తుంది. 'కచటత' అన్నది నీటిమీద పొరగా వ్యాపించిన నూనెలో




ఒక తునక అనుకోండి. 'యర'అన్న వెల్తురు కిరణం దాని ఉపరితలముమీద పడింది. కొంతభాగము 'రవ' వెంబడి పరావర్తమైపోయినా, కొంతభాగము 'రత' వెంబడి నూనె పొరలో ప్రయాణించి, అడుగు తలము మీద పరావర్తమై 'తల' వెంబడి పైకి తేలి, 'లమ' వెంబడిని గాలిలోకి తిరిగి ప్రవేశిస్తుంది ఈ కిరణము. బొమ్మలో వివరంగా కనబడడానికి పెంచాము కాని, 'కచటత' అనే నూనె పొర వాస్తవానికి అతిసూక్ష్మంగా వుంటుంది. 'యర' అన్న కిరణము నేరుగా 'రవ' వెంబడిని గాలిలోకి వచ్చేసినా, 'రత లమ'అన్నది నూనెలో ప్రవేశించి ఎట్టకేలకు తేలడములో వెనకబడిపోతుంది. ఏతా వాతా 'ర,' 'ల' నుంచి గాలిలోకి ప్రసరించే కిరణాలకు మార్గభేదము సంక్రమిస్తుంది. అంటే 'ల, ర' లు అతి చేరువగా వున్నప్పుడు 'య ర' కిరణముయొక్క తరంగము 'ర' వద్ద, 'ఎగుటు' గానూ, 'త ల' కిరణపు తరంగము 'దిగుటు' గానూ ఉండడానికి వీలు ఏర్పడుతోంది. ఇది జరిగితే, 'ల మ' వెంబడి కిరణమే ఉండదు. అంటే 'మ ల' వెంబడిని చూస్తే వెలుతురు కనబడదు. చీకటే నల్లగా 'కనబడుతుంది.'

నీటిమీద విస్తరించే నూనెపొర అంతటా ఒకే దళసరివుండదు. పటములో 'క చ ట త' అన్నది నూనెపొర. రెండు కిరణాల దారులు సూచింపబడ్డాయి. 'య, ర' అనే చోట పడిన కిరణాలు, నూనెలోంచి మళ్లీ గాలిలోకి వచ్చేసరికి వాటి మార్గభేదము వేర్వేరుగా ఉంటోంది. దీనివల్ల 'శ' 'ష' ల కడ బయల్దేరే కిరణాలలో ఒకరంగు లోపించడమూ, ఇంకొక రంగు కనబడడము జరుగుతుంది. అంటే, 'శ, ష' లకడ బయల్దేరే కిరణాలలో నీలిరంగు ఎగుటుగాను, ఎఱ్ఱరంగు దిగుటుగానూ ఉండవచ్చు. ఇలాగే 'శ ష' లకు ఇటూ అటూ ఉన్నచోట్లకడ, నేరుగా గాలిలోకే పరావర్తమై వెళ్లే తరంగానికీ, నూనెలో దిగివచ్చి పైకి వెళ్లే తరంగానికీ విరోధము ఏర్పడి, ఏ రంగులు




చెల్లిపోతే అవి లోపించి, ఏ రంగులు బలపడితే ఆ రంగులు కనపడతాయి. నీటిమీద వ్యాపించిన కిరసను నూనెకు రంగులిలాగ వచ్చినవే.

కళ్లజోడు ధరించేవారు చీకటిలో వాన తుంపురులు పడుతూన్నప్పుడు, తమ కళ్ళజోడుమీదపడ్డ నీటి తుంపురు ద్వారా దూరపు దీపాన్ని చూస్తే, ఈ తుంపురు అంచుదగ్గర వెల్తురూ చీకటీ వెల్తురూ చీకటిగా 'చారలు' కనబడతాయి. ఇవి, నీటి తుంపురు అంచు సమమైన దళసరి లేక క్రమంగా అంచువైపు తగ్గిపోతూండడమువల్ల, ఈ అంచులో రెండుచోట్లనుంచి వొచ్చుకు

వచ్చే తరంగాల సంఘర్షణవల్ల ఎగుటు అయినచోట వెలుగూ దిగుటు అయినచోట చీకటీ, గా కనపడతాయి. (కిరణము అంటే తరంగము విస్తరించే మార్గము)

## 163. చంద్రబింబం భూమినుంచివిడిపోయిందా?

అయితే దానికి సాక్ష్యమేమిటి? అని ప్రశ్న.

భూమికి దగ్గరగానున్న ఖగోళము చంద్రుడు. సూర్యుడివైపువెళ్ళితే శుక్రుడూ బుధుడూ చేరువకి వస్తాయి. సూర్యుడికి దూరంగాపోతే కుజుడూ, గురుడూ, శనీ, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహాలు వస్తాయి. ఇవన్నీ సూర్యుడిచుట్టూ తిరుగుతున్నవే. సూర్యుడూ గ్రహకుటుంబమూ చేరి ఒక గుంపు. ఈ గుంపును వీడి వేరొక నక్షత్రానికి పోవాలంటే దూరము నాలుగు జ్యోతిర్వర్షాలు (సెకనుకు 186 వేల మైళ్ళ చొప్పున వెల్తురు ఒక సంవత్సరంలో ప్రయాణించే దూరము జ్యోతిర్వర్షము) అంటే ఏమన్నమాటా? అనంతాకాశములో సూర్యుడూ అతని గ్రహమండలమూ గుప్పెడు మేరలో వున్నాయన్న మాట! గ్రహాలు ఎలాగు ఏర్పడ్డాయీ? అన్న ప్రశ్నకిజవాబు వీటన్నిటికంటే ఎన్నోరెట్లు పెద్ద అయిన సూర్యుడిమీదికి తిరుగుతుంది' ఒకప్పుడెప్పుడో ఇవన్నీ సూర్యుడితో చేరి ఉండేవి, తరవాత ఏదో అవాంతరమువల్ల సూర్యుడినుంచి వేరయ్యాయీ అనేదే గ్రహాలెలాగు ఏర్పడ్డాయీ? అన్న ప్రశ్నకి జవాబు. అదేరీతిగా గ్రహాలతో నేడు కనపడుతున్న ఉపగ్రహాలు ఎన్నడో గ్రహాలతో చేరి ఉండేవి, తర్వాత ఏదో అవాంతరమువల్ల సూర్యుడి ఆకర్షకు లొంగి, గ్రహాలలోని ద్రవ్యము గ్రహాలనుంచి వేరైపోయి ఉపగ్రహాలుగా ఏర్పడిందన్నదే చంద్రుడువంటి ఉపగ్రహాలు ఎలా ఏర్పడ్డాయన్న ప్రశ్నకి జవాబు.




పటములో సూర్యుడు 1 అన్నచోట ఉన్నప్పుడు లోపల అంతా ద్రవముగానే ఉన్నా పై భాగంలో శేనపురాతి పొరగట్టిన భూమియొక్క ద్రవ్యము బొడిపిలాగ సూర్యుడివైపు పొడిచింది. (సముద్రపు నీరు చంద్రుడివైపు పొడవడమే 'పోటు' అంటాము.) సూర్యుడు2, అనేచోటికి వచ్చినప్పుడు ఈ బొడిపి పొడుగై, 3 దగ్గర భూమినుండి చీలిపోయి చంద్రుడైపోయింది. భూమి, బాణము సూచించినట్లు తిరుగుతోంది తన చుట్టూ. సూర్యుడి గమనము, భూమినుంచి వేరైన చంద్రుడికి తనకున్న గమనాన్నే ఇచ్చినా, భూమి ఆకర్షణశక్తివల్ల చంద్రుడు భూమిచుట్టూ తిరుగుతున్నాడు.

ఈ తబిళ్లే నిజమైతే, చంద్రుడు తెగిపోయినచోట భూమికి ఖాళీ, - లోయ - కనబడాలి. చంద్రగోళము విడిపోయిన క్షణానికి భూమి పూర్తిగా ద్రవమే అయివుంటే చంద్రుడు ఖాళీచేసిన మేరని ఆ ద్రవము నింపేస్తుంది, ఖాళీయే కనబడదు. కాని ఆ క్షణానికి భూమియొక్క పై పొరలు ఏర్పడివుంటే మట్టుకు, చంద్రుడు పోయినచోట ఖాళీ ఏర్పడుతుంది. భూగర్భశాస్త్రజ్ఞులు పసిఫిక్ మహాసముద్రమే ఈ లోయ అనీ తరవాత చల్లారిన నీటి యావిరీ, వర్షమూ సముద్రాన్ని తయారు చేశాయనీ అంటారు. పసిఫిక్ సముద్ర తీరము తూర్పు పడమరలు గమనిస్తే సుమారుగా వర్తులాకారంగానే ఉంటాయి, ఒక గోళాన్ని పెరికివేసినట్టు. ఇంతమాత్రమే కాదు. చంద్రుడు భూమినించి విడిపోయిన కాలానికి భూమి కొంత పొరగట్టే వుండినట్లయితే, చంద్రుడు వెళ్ళిపోవడమువల్ల ఈ పొరల్లో కన్నము ఏర్పడి ఇప్పటికి కొంతేనా కనపడాలి. ప్రపంచమంతటా, పై పొరల్లో తేలికైన శేనపురాయీ, బాగా లోతున శేనపురాయికంటె కర్కశమైన శిలల పొరలూ కనపడతాయి. అట్లాంటిక్, హిందూమహాసముద్రాల అడుగునా ఇదే కనబడుతుంది. కాని పసిఫిక్ సముద్రపు అడుగున శేనపురాతి పొరలు లేవు! కర్కశ శిలల పొరలే వున్నాయి. శేనపు రాతిపొరలు చంద్రుడితో లేచిపోయాయి. అంటే చంద్రగోళములో శేనపు రాతిభాగమే యెక్కువ కర్కశశిలా భాగము తక్కువ కనక పరికిసరాతీసుకుంటే భూగోళ ద్రవ్యముకంటె చంద్రగోళ ద్రవ్యము తేలికగా ఉండాలి. ఇదీ సరిపోయింది. భూగోళ ద్రవ్యపుసాంద్రత 5½ అయివుండగా చంద్రగోళద్రవ్య సాంద్రత 3⅓ అయితే, నిశ్చయంగా చంద్రగోళంలో శేనపురాయే యెక్కువగా వున్నదా అని తెలుసుకోవడము చంద్రగోళంలోకి వెళ్ళగలిగేటంతవరకూ సాధ్యము కాదు. ★



ఖ రీ దు లే ని ఘ ర్మ జ ల ం

శిల్పి : దేవీప్రసాద్‌రాయ్ చౌదరి.




# పిచుక తెలివి



"ఎల్లోరా"

పసిడినవ్వులా బాలల్లారా
పెరిగేపచ్చని పిందెల్లారా
చీకటిబాటల జ్యోతుల్లారా
విన్నారా మీ రీ కథను!-

అనగనగనగా ఒక చెట్టూ
దానిపైన గల దొక గూడు
గూడున గల దొక చక్కనిపిట్ట
పిచుకయనంబడు నాపిట్ట!-

చూచుట కింపుగ ఉంటుందీ
బుద్ధికి పెద్దగ ఉంటుందీ
గంతులు వేస్తూ, కిలకిలమంటూ
కలకలలాడుతు వుంటుంది!-

బాలులందరము సరదాతో
పట్టగ వెళితే దూరంగా
కూతలు పెడుతూ మెల్లంగా
తుఱ్ఱున ఎగురును ఆపిట్ట!-

భాద్రపదమ్మా రాగానే
వర్షపు చినుకులు పడగానే
చల్లనిగాలులు రాగానే
గూడును కట్టును మెత్తంగా!-

పెంటలపీచూ జేరేసి
పరుపులదూదీ పోగేసి
పుల్లలు బల్లగ నేర్పరచి
కట్టునుగూడును నేర్పుగను!-

చీకటిగూటిలో కాంతులు జిమ్మగ
చిగురుమట్టిని ముద్దగ బెట్టి
తళతళ మెరసే వెన్నెలపురుగును
ముక్కుతో పట్టీ మట్టిలో గ్రుచ్చును!-

గూటిలో పిల్లల పక్కన చేరి
వెన్నెలపురుగూ కాంతులుజిమ్మగ
గాలికి గూడూ ఉయ్యాలలూగగ
హాయిగ కునుకులు తీస్తుంది!-

పిచుక తెలివిని చూశారా!
ఎంతగడసరో విన్నారా!!





(సీరియల్)

# మనిషిలో మనిషి

DR. JEKYLL AND MR. HYDE

R. L. STEVENSON



## డాక్టరు లాన్యనుయొక్క విచిత్ర అనుభవ విశేషం

## 6

రోజులు గడచిపోతున్నాయి సర్ డాన్వేర్సుగారి చావు కేవలం ఒక ప్రజోపద్రవంగా భావింపబడుటచేత, హంతకుని పట్టుకుంటే వేలకొలది పౌనుల మొత్తం బహుమానంగా యిస్తామని ప్రకటన చేశారు. హైడ్ అనేవాడు యీ జగత్తులో లేనేలేడు అన్నట్లుగా, పోలీసువారి ఆచూకీకి చిక్కకుండా మాయమైనాడు. అతనిని గురించిన వెనుకటి విశేషాలు కొన్ని దర్యాప్తు చేశారుకూడా — కాని, యీ పూర్వ విశేషాలన్నీ చాలా ఘోరంగా ఉన్నాయి. ఆ మనిషినిగురించి తెలిసిన కథలన్నీ అమానుష కిరాతదారుణ ప్రవర్తనలుగా ఉన్నాయి. హద్దు మేరలేని అతని నడవడికనుగూర్చియు, అతనియొక్క విచిత్ర విపరీత సహచరులను గూర్చియు, అతని జీవితంలో మూర్తీభవించి యున్నటువంటి మదమాత్సర్యములను గూర్చియు, చాలా కథలు తెలియవచ్చినాయి. కాని అతని తావు టికాణాల గూర్చి ఒక్కముక్కయినా చెప్పినవాళ్లు లేరు. హత్యజరిగిన నాటి తెల్లవారిజామున సోహో చౌకులోని అతని యింటినుంచి నిష్క్రమించినది మొదలు అతడు నామరూపాలు లేకుండా పోయినాడు. అట్టర్సనుకు మొదట్లో కలిగిన కలవరపాటు, కొంత శాంతించి, ఆ వేడి క్రమేణా తగ్గినకొలదీ ఉధృతంఅతని మనస్సుకూడా కుదటబడింది. సర్ డాన్వేర్సు ఖూనీచేయబడినందుకు ఫలితంగా హైడ్ ఊరుపేరులేకుండా అంతరించాడు కనుక, ఆ హత్యకు అది తగిన ప్రాయశ్చిత్తమేనని అట్టర్సను తన ఊహాధోరణినిబట్టి ఊహించుకొన్నాడు. ఆ దుష్టుని సహవాసదోషం యిప్పుడు లేదు గనుక, డాక్టరు జెకిల్ జీవితం కొత్త అధ్యాయంలోకి మారింది. డాక్టరు జెకిల్ యిప్పుడు తన మారుమూల సౌధంలో కూర్చుండక బయటకువచ్చి తన స్నేహితులతో కలిసి మెలసి తిరుగుతున్నాడు. తన స్నేహితులకు తాను అతిథిగా ఉంటూఉండడం, తన స్నేహితులను విందు భోజనానికి తాను ఆహ్వానించడం సాగించాడు. దాన ధర్మాలుచేయడంలో అతను అదివరకే సుప్రసిద్ధుడు. ఇప్పుడు దానికి తోడుగా మతవిషయ భగవద్గోష్ఠిలో కూడా ప్రముఖుడైనాడు. ఎప్పుడూ ఏదో వ్యవహార ప్రసక్తితో, పదిమందిలో కలిసి తిరుగుతూ, సత్కార్యాలు చేస్తూఉన్నాడు. ముఖంకూడా వికసించినట్లుగా తేజోవంతంగా ఉంటున్నది—పరోపకార పుణ్యప్రసక్తితో మనిషి ప్రకాశిస్తున్నట్లుగా ఉన్నాడు. ఇంచుమించు రెండుమాసాలకు మించి డాక్టరు జెకిల్ జీవితం ఆత్మశాంతి పరిశోభితం అయింది.

జనవరి 8 తేదీని డాక్టరు జెకిల్ యింట్లో కొద్దిమందికి విందుజరిగింది. దానికి అట్టర్సను హాజరైనాడు. డాక్టరు లాన్యనుకూడా అక్కడకువచ్చాడు. వీరు ముగ్గురూ ఒకరినివిడిచి ఇంకొకరు ఉండక సన్నిహిత స్నేహంతో కలిసిమెలిసి తిరుగుతున్నటువంటి వెనుకటి దినాలలో డాక్టరు జెకిల్ ఏవిధమైన స్నేహభావంతో చూచేవాడో ఆ విధంగానే నేడుకూడా డాక్టరు జెకిల్

మూలం : రాబర్ట్ లూయీ స్టీవెన్సన్  అనువాదం : దాసు వామనరావు

#  మనిషిలో మనిషి 

ఒక్కొక్కరివంక స్నేహానురాగంతో చూచాడు. కాని, జనవరి 12 తేదిని, 14 తేదీని జెకిల్ యింటికి లాయరు వెళ్లితే లోపలికి పోవుటకు లేకుండా తలుపు మూసివేయబడింది.

"డాక్టరు బయటకు వెళ్లకుండా యింట్లోనే ఉంటున్నాడు. కాని ఎవ్వరికీ దర్శనం యివ్వడంలేదు" అని బట్లరైన పూల్ అన్నాడు—తిరిగి 15 తేదీని అట్టర్సను వెళ్లాడు—కాని దర్శనం లభించలేదు. గత రెండు మాసాలలో తన మిత్రుణ్ని ప్రతిరోజూ కలిసికొని కాలక్షేపం చేస్తూ ఉండడం అట్టర్సనుకు అలవాటై పోయింది. అందువల్ల తన మిత్రుడు యీవిధంగా తిరిగి ఏకాంతవాసంసాగించడం ఏమిటో అట్టర్సనుకు అర్థం కాక అది అతని మనస్సును వేధిస్తోంది. నాలుగు పర్యాయములు అతని దర్శనానికి ప్రయత్నించి, ఇక అయిదోరోజు రాత్రి తన గుమస్తాయైన గెస్ట్‌ను తన యింటికి భోజనానికి రమ్మని పిలిచాడు. ఆరో రోజు రాత్రి తానే డాక్టరు లాన్యను యింటికి వెళ్లాడు.

అక్కడమాత్రము అట్టర్సను నిరభ్యంతరంగా లోపలికి వెళ్లాడు. కాని, లోపలికి వెళ్ళినతర్వాత, డాక్టరు లాన్యను ముఖంలో కలిగిన కొత్తమార్పును చూచి అట్టర్సన్ నిర్ఘాంతపోయినాడు.

అతని రోజులు దగ్గరకు వచ్చాయని అతని ముఖంలో స్పష్టంగా కన్పిస్తోంది. అదివరకు పద్మం లాగున ఉండే ముఖం ఇప్పుడు పాలిపోయిఉంది. మనిషిలో కండపుష్టి బాగా తగ్గిపోయింది. వెనుకటికంటే చాలాబట్టతల అయింది. ఎక్కువ ముసలివాడుగా కన్పిస్తున్నాడు. శరీరం యీ విధంగా శుష్కించడం చూచి అట్టర్సను అంతగా నిర్ఘాంతపోలేదు. కాని, ఆయన చూపులోనూ తీరులోనూ వేరుపారిన పెనుభూతంవంటి పెనుభీతి ఒకటి కన్పించడంవల్లనే అట్టర్సన్ అలా నిర్ఘాంతపోయినాడు—డాక్టరు లాన్యనుకు మరణం అంటే భయంఉండడం అసంభవం. అటువంటిదే ఆయనలో ప్రవేశించినదని లాయరు అనుమానించాడు. "అవును. ఆయన డాక్టరు కనుక ఆయన స్థితి ఎట్లా ఉన్నదో ఆయనకు తెలిసిఉండాలి. తన రోజులు సమీపించాయని గ్రహించి ఉండాలి. ఈ గ్రహింపువల్లనే ఆయన కృశించియుండవచ్చు." అని ఆయన ముఖలక్షణాలగూర్చి అట్టర్సను కొంచెం విమర్శిస్తూ అనుకొన్నాడు. అప్పుడు డాక్టరులాన్యను తనపనిఅంతా అయిపోయిందనిన్నీ, తనకు ఆయువు మూడినదనిన్నీ నీళ్లు నమలకుండా నొక్కి వక్కాణించాడు.

"నాకు మనస్సు చెదిరిపోయింది. నేనిక తిరిగి కోలుకోలేను. నా పని ఇక కొద్దివారాలలోనే ఉంది. బ్రతికినంతకాలమూ నా జీవితం హాయిగా గడచిపోయింది. నాకు బ్రతుకుమీద భ్రమ ఎప్పుడూ ఉంది. అవును. నిజంగానే జీవితంఅంటే సదా సరదాపడ్డాను. మనము సమస్తమూ తెలిసినవాళ్లమే అయినట్లతే, యీ లోకంనుంచి వెళ్ళిపోవడమే ఉత్తమమని నాకు అప్పుడప్పుడు తోస్తూఉంటుంది." అని డాక్టరు లాన్యను అన్నాడు.

"జెకిల్ కూడా జబ్బుగానే ఉన్నాడు. అత

నిని యీ మధ్య ఎప్పుడైనా చూచావా ?" అన్నాడు అట్టర్సన్.

లాన్యన్ ముఖంలో రంగుమారింది వణుకుతూ వణుకుతూఉన్న చేయి పైకి ఎత్తాడు. "డాక్టరు జెకిల్‌ను నేను చూడదలచుకోలేదు. అతనిమాట నేను వినదలచుకోలేదు. అతనితో నా ప్రాణం తల్లడిల్లిపోయింది. గతించిన మనిషిగా నేను భావిస్తున్నటువంటి ఆ వ్యక్తిని గూర్చి నీవు ప్రస్తావించవద్దని నా మనవి" అని డాటరు లాన్యను గొంతుక పెద్దచేసి అన్నాడు.

ఆ మాట విని అట్టర్సను కొంతసేపు ఆగి, "ఛా ! ఛా! నీకు నేను ఏమైనా సహాయం చెయ్యనే లేనా? లాన్యన్ ! మనం ముగ్గురం ఎంతో పాత స్నేహితులం. ఇంకా మనం కొత్త స్నేహాలు చెయ్యడానికి ఇంకా బ్రతుకపోయేది లేదు" అన్నాడు అట్టర్సను.

"నీవు నాకు చేయగల్గింది ఏమీ లేదు. అతనినే వెళ్లి అడుగు" అని లాన్యను బదులుచెప్పాడు.

"అతడు నాకు దర్శనమే యివ్వడంలేదు" అని లాయరు అన్నాడు.

అప్పుడు లాన్యను యిలా జవాబు చెప్పాడు. "అందులో నాకు ఆశ్చర్యమేమీ లేదు. అట్టర్సన్ ! నేను చచ్చిపోయినతర్వాత యీ విషయంలో ఉన్న మంచిచెడ్డలు ఒకనాటికి నీకే బహుశః బోధపడవచ్చు. నే నిప్పుడేమీ చెప్పలేను బాబూ! వెయ్యి దేవుళ్లకు దణ్ణంపెడ్తా ! ప్రస్తుతం నాతో యితర విషయాలు నీవు యేవైనా మాట్లాడ గల్గితే, ఇక్కడ కూర్చుండి మాట్లాడు. కాని ఆ ప్రస్తావన తప్ప ఇంకో సంగతి నీవు మాట్లాడుతానంటే, దేవుడా ! నేను అది భరించలేను. నీవు దయచెయ్యి !" అన్నాడు.

అనంతరం అట్టర్సను తన యింటికి వెళ్లి వెంటనే ఒక ఉత్తరం జెకిల్‌కు వ్రాశాడు. జెకిల్ యింటికి తాను వస్తే దర్శనం యివ్వక నిరాకరిస్తున్న విషయమున్నూ డాక్టరు లాన్యనుతో డాక్టరు జెకిల్ తన స్నేహ సద్భావమును చెడగొట్టుకొనడం శోచనీయమనియున్నూ అందుకు గల సందర్భ కారణములను తెలియజేయవలసినదనిన్నీ ఆ ఉత్తరంలో వ్రాశాడు. ఇందుకు జవాబుగా మరునాడొక పెద్దఉత్తరం జెకిల్ వద్దనుంచి వచ్చింది. అందులోని వాక్యాలధోరణి అక్కడక్కడ విశేష విషాదభరితంగా ఉంది. కాని, కొన్నిచోట్ల అర్థంకాని సందర్భాలతో ఉంది. డాక్టరు లాన్యనుతో సంభవించిన కయ్యానికి తిరుగులేదు. డాక్టరు జెకిల్ యిలా వ్రాశాడు—"మన పాతమిత్రుణ్ని నే నీ విషయంలో నిందించను. కాని, తిరిగీ మేమిద్దరం కలిసికొనడం మంచిదికాదని అతడు తన అభిప్రాయం తెలియజేశాడు. నా అభిప్రాయంకూడా అంతే. ఇకముందునుంచి నేను ఏకాంతవాసంచేస్తూ కాలం గడపుటకు నిశ్చయించాను ఆవిషయమై నీవు ఆశ్చర్యపడవద్దు. నీకుకూడా నేను దర్శనం యివ్వక తలుపు బంధించి కూర్చున్నందువల్ల మన యిద్దరిమధ్య ఉన్న స్నేహాన్ని గూర్చి శంకించవద్దు-నానిగూఢతంత్రపద్ధతిలో నన్ను పోనియ్యి. నాకు నేనే స్వయంకృతాపరాధంవల్ల ఒక ఉపద్రవం తెచ్చిపెట్టుకొని తగిన ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను. పాపులలోకెల్ల నేను పాపిష్టి శిఖామణిని అయినట్లయితే, దానివల్ల అధోగతిపాలైనవాళ్లల్లో కూడ నేనే అగ్రగణ్యుడను-ఇటువంటి అలవికాని ఘోరావస్థలున్నూ, భయంకరవిపత్తులున్నూ యీ ప్రపంచంలో ఉంటాయని నే నెన్నడూ ఊహించలేదు. నాదుర్గతిని నేను భరించగలిగేటట్లు నీవు నాకు సహాయంచేయ దలంచుకున్నట్లయితే, నా మౌనం విషయంలో నీకు సహనం ఉండాలి."

ఈ ఉత్తరం చదువుకున్న అట్టర్సను ఆశ్చర్యపోయినాడు. హైడ్ యొక్క సాంగత్యదోషం జెకిల్‌ను బాధించకుండా తొలగిపోయిందిగదా. డాక్టరు జెకిల్ తిరిగీ వెనుకటి సద్గోష్ఠిలోనూ మంచి సహవాసాలలోనూ తిరుగుతున్నాడు.—అతడు తిరిగీ ఉల్లాసంగా ఈముది వయస్సులో గౌరవమర్యాదలతో కాలక్షేపంచేయగలడనే సూచనలు బాగా కన్పించినవి. కాని, అటువంటి పరిస్థితిలో అతని ఆంతరంగిక మిత్రులతోటి స్నేహసద్భావాలూ, అతని మనశ్శాంతి, అతని జీవితధోరణీ, యివన్నీ ఒక్కక్షణంలో ధ్వంసమైపోయినాయి. ఇటువంటిమార్పు యింత హఠాత్తుగా అతనిలో రావడంచూస్తే అతనికి మతి చెడిందని తోస్తోంది. కాని, డాక్టరు లాన్యను చెప్పిన మాటలనుబట్టియు, ఆమాటల వైఖరినిబట్టియు చూస్తే డాక్టరు

(54-వ పేజీ చూడుడు)

# కోదండయ్యగారి కోపం

పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

మాకు కోదండయ్యగారని ఇంగ్లీషు మాస్టారు వుండేవారు. మేము ఆయనదగ్గరే ఇంగ్లీషు ప్రయివేటు కూడా చదివేవాళ్ళం. ఆయనగారి ధర్మపత్ని పేరు "సత్యవతి"గారు. మహా గయ్యాళిమనిషి. ఆమె ఎదురు పడినప్పుడు తప్ప మా కోదండయ్యగారు ఎప్పుడూ శాంతంగా వుండరు. అంటే ఆయన, తన సహజాకారంకాక యింకా రెండు ఆకారాలు ధరిస్తారు. మొదటిది శాంతాకారం, రెండవది రౌద్రాకారం. సత్యవతమ్మగారు యెదురుగా వున్నప్పుడుమాత్రం ఆయన శాంతాకారం తప్ప మరియే యితర ఆకారం, ధరించడానికీ వీలుండదు. సత్యవతమ్మగారు కాకుండా తన శిష్యు లెవరన్నా ఎదురుగావుంటే, తీవ్ర రౌద్రాకారం ధరిస్తారనడంలో సందేహం లేదు. ఇహ, శిష్యులుగాని, సత్యవతమ్మగారుగాని, మరి యెవరు లేనప్పుడు తన సహజాకారం ధరించేవారు.

సత్యవతమ్మగారినిగురించి చెప్పాలంటే చాలా వుంది. పారిజాతాపహరణ కథా సందర్భంలో సత్యభామ కృష్ణమూర్తిని దయా దాక్షిణ్యాలు లేకుండా యేవిధంగా తన్నిందో, అదేవిధంగా మన సత్యవతమ్మగారు కూడా కోదండయ్యగారిని కొన్నికొన్ని సందర్భాలలో "అంతపనీ చెయ్యటానికి వెనుదీయదు" అన్నట్లుగా ప్రవర్తించేది. కలక్టరుగారు, జవానుకి ఆర్డరు వేసినట్లుగా కోదండయ్యగారిని ఆజ్ఞాపిస్తుండేది. పాపం! కోదండయ్యగారు నోరెత్తితే ఒట్టు! లేకపోతే ఆరోజున ఆయనకి చెయ్యి కాల్చోక తప్పదు. ఆయింట్లో సత్యవతమ్మగారి మాటకు తిరుగులేదు.

సత్యవతమ్మగారు, కోదండయ్యగారినే కాదు, ఆ యింటికి వచ్చిన ప్రతి పెద్దమనిషినీ అట్లాగే 'పూజిస్తుంద' (మాతో సహా) అందుచేత, ఆ సత్యవతమ్మగారికి భయపడి, ఆయింటికి బంధువు లనేవాళ్లు, ఎవరన్నా వున్నా, రారు. ఎన్నాళ్లు



ఒకనాడు, మా కోదండయ్యగారికిష్టమైన బెండకాయలు ఒకవీశడు తీసుకువెళ్లి ఇచ్చేను.

# ★ కోదండయ్యగారి కాపురం ★

చూసినా ఆ రెండే రెండు జీవాలు, ఆయింట్లో.

సత్యవతమ్మగారు చెప్పినట్లు మేముకూడా తప్పకుండా చేస్తాము. ఆవిడగారు చెప్పినట్లు చేయటం మాకు యిష్టమే. ఎందుచేత నంటారేమో? ఆవిడగారు చెప్పినట్లల్లా చేస్తూ కూర్చుంటే కొంతలో కొంతగానైనా జైము కలిసి వస్తుంది, ప్రయివేటు తప్పించుకోటానికి. పైగా సత్యవతమ్మగారు చెప్పిన పని చేస్తున్నాము గనక, కోదండయ్యగారు మమ్మల్ని యేమీ అనలేక పోయేవారు.

ఒకనాడు, మా కోదండయ్యగారి కిష్టమైన బెండకాయలు ఒక వీశడు, (మాదొడ్లో కాసినవిలెండి) తీసుకువెళ్ళి యిచ్చాను. ఆ మర్నాడే మా రఘుకూడ ఒక అరడజను పొట్లకాయలు (అవి అంటే సత్యవతమ్మగారికి చాల యిష్టం) తీసుకువెళ్ళి యిచ్చాడు. ఇక ఆరోజున సత్యవతమ్మగారు, రఘునిములగచెట్టెక్కించేసింది. నన్నుకూడ కోదండయ్యగారు ఆవిధంగానే పొగిడేవాడేగాని, సత్యవతమ్మగారువచ్చి యెక్కడ మీద పడుతుందోనని వూరుకున్నాడు. అంతటితో వూరుకోక, ఆరోజు మొదలుకొని ప్రతిరోజూ రఘుని పొట్లకాయలు తెమ్మనీ, నన్ను బెండకాయలు తెమ్మనీ వేపుకుతినేవారు, యిద్దరూ కలిసి. ఇక చివరకు విసుగెత్తిపోయి నేను "యేమిచేద్దామా?" అని ఆలోచించాను.

ఆ మర్నాడు బెండకాయల మూటా, పొట్లకాయల మూటా తీసుకువెళ్ళి అక్కడపెట్టి "యివిగో నండీ! కూరగాయలు" అని చెప్పి రఘు యివతలకువచ్చేశాడు. అదేమి చిత్రమోగాని ఆనాటినుంచీ కోదండయ్యగారు మమ్మల్ని బెండకాయ లడిగితే వొట్టు.

అసలు సంగతేమిటని రఘుని అడిగితే ఆ మూటల్లో కూరగాయలతో బాటు రెండు "చేవలు"కూడా పెట్టి వచ్చానని చెప్పాడు. సరే - కూరగాయల బాధ వదిలిపోయింది గదా అని సంతోషించాను.

ఇంకొకనాడు, అంటే యింకొక వారం రోజులకి నెల ఆఖరవుతుందనంగా సత్యవతమ్మగారు మా అందరివద్దరా జీతాలు వసూలు చేసింది. అంతకుముందురోజే ఆవిడ కోదండయ్యగారితో తనకొకమంచి చీరె తెమ్మని పోట్లాడుతూవుండటం మేమందరం విన్నాము. కోదండయ్యగారు "యింకొక వారం రోజుల్లో జీతాలు వస్తాయి, అప్పుడు తప్పకుండా కొంటా" నని చెపుతున్నాడు. కాని సత్యవతమ్మగారు మాత్రం యివేమీ వినిపించుకోకుండా "అయితే యివ్వాళ నేను. వంట చెయ్యను. నువ్వే చేసుకో" అని దుప్పటి ముసుగు పెట్టింది. పాపం! కోదండయ్యగారు వంట చేసుకుంటుంటే, సందు చూసుకొని మేమంతా ఇళ్లకు వుడాయించాము. దాన్నిబట్టి యిప్పుడే జీతం వసూలు చెయ్యడం చీర కొనుక్కోటానికే ననుకుని మా జీతాలు పట్టుకెళ్ళి ఆమెగారి కిచ్చేశాము.

ఆనాడు మా కోదండయ్యగారి

(56-వ పేజీ చూడండి)

# కవి ఎన్నిక

ఓ రోజున రాజు తన మంత్రితో-"మన ఆస్థానానికి ఓ కవి కావాలి. అతడు నిజమైన కవియై వుండాలి" అన్నాడు.

మరునాడు మంత్రి నగరంలో చాటింపు వేయించాడు. మూడో నాడు వేయిమంది రాజభవనందగ్గర గుమికూడారు. వారంతా కవులు. మంత్రి యిరవైఒక్క రోజు వారి కవిత్వాన్ని విన్నాడు. మంత్రికి వారంతా కవులుగానే తోచారు. వారిలో భావమూ వుంది; భాషా వుంది; కవిత్వమూవుంది; కావ్యమూ వుంది.

కాని, వారిలో గొప్పవాడెవరో మంత్రి నిర్ణయించలేకపోయాడు. ఒకరోజు ఆలోచించాడు, రెండు రోజులు ఆలోచించాడు, మూడు రోజులు ఆలోచించాడు. కాని, ఫలితం లేకపోయింది. నాలుగో రోజున వేయిమంది కవులపేర్లు ఓ కాగితంమీద వ్రాసి రాజుగారి కందించాడు.

మహారాజు ఆ లిస్టుచూచి విసుక్కున్నాడు—"వీళ్లంతా కవులేనా?"

మంత్రి వినయ విధేయలతో తల వంచి—"రాజా! నేను వారి కృతులను విన్నాను. విన్నమీదటే, యీ లిస్టు తయారుచేశాను. కాని, మనకు కావాల్సింది, ఒక కవి; వీరు వేయిమంది వున్నారు. నేను వారిలో గొప్పవారెవరో తేల్చలేకపోయాను" అన్నాడు.

మహారాజు ఓ గంట ఆలోచించాడు, రెండుగంటలు ఆలోచించాడు, మూడు గంటలు ఆలోచించాడు. నాలుగో గంటలో—"వీరిని ఖైదులో పెట్టు! కఠినంగా శిక్షించు! ఇక ఎవ్వరైతే కవిత్వం రాస్తారో వారికి కొరడా దెబ్బలు తగులుతాయని చెప్పు! వెళ్ళు! నేను చెప్పినపని చేయి!" అని మంత్రికి చెప్పాడు.

మంత్రి రాజుగారు చెప్పిన ప్రకారం చేయించాడు. ఇప్పుడు అక్కడ ఒక్క కవీ లేడు, కవిత్వమూ వినపడటములేదు. ప్రజలు వారి దుస్థితి చూచి, విని, వాపోయారు.

## 2

ఆరు మాసాలు గడిచిపోయిన తరువాత, ఓ రోజున మహారాజు కవులు బందీ చేయబడ్డ బందిఖానాకు వెళ్ళాడు. అందరినీ సోదా చేయమని ఆజ్ఞాపించాడు. సోదాచేయగా, ఆ వేయిమంది కవులలో ఓ వంద మంది, అనేక కష్టాలు అనుభవిస్తూ కూడ, కవిత్వం వ్రాసినవాళ్ళు వున్నారు. వారుమాత్రం, ఈ విషయం మహారాజుకి తెలిస్తే కఠినంగా శిక్షిస్తాడని మరచేపోయారు. కొరడా దెబ్బలు తినాల్సివస్తుందని వారు భయపడలేదు.

మహారాజు తన మంత్రిని పిలిచి-"చూచావా? వీరు కవులు! ఆ మిగిలిన తొమ్మిదవందలమంది పేరు కోసం పాకులాడేవారు. అందువల్ల వారందరికీ, ఆరేసి మాసాలు జీతం యిచ్చిపంపు! ఈ వందమందిని మన మోర్ మహల్‌లో పెట్టు! వారికి ఎట్టి కష్టమూ కలుగకుండా చూడు!" అని చెప్పాడు.

మంత్రి అలాగే చేశాడు. ఇప్పుడు కవులు మంచి బట్టలు కట్టుకుంటున్నారు, మంచి తిండి తింటున్నారు. ఆనందంతో హాయిగా రాజుగారి మోర్ మహల్ లో వుంటున్నారు. మిగతావాళ్ళంతా వారి మంచిస్థితి విని, చూచి తమ దౌర్భాగ్యానికి వాపోయారు.

ఆరుమాసాలు గడిచిన తరువాత, ఓ రోజున రాజు తన మంత్రితో ఆ వందమంది కవుల దగ్గరకు వెళ్ళాడు. వారినందరిని తన దగ్గరకు పిలిచి—"ఈ ఆరు మాసాలకాలంలో మీరు చేసిన పనిని చూడాలనుకుంటున్నాం! మీరు వ్రాసిన కవిత్వం వింటాం!" అన్నాడు.

ఆ వందమందిలో ఒక్కడు మాత్రం తన కవిత్వాన్ని వినిపించటానికి సిద్ధపడ్డాడు. అతడు మోర్ మహల్ వైభోగంలోపడి కవిత్వాన్ని మరచేపోలేదు. నిత్యమూ కవిత్వం వ్రాసి తనలో తానే చదువు

మూలం : సుదర్శన్

అనుసరణ : 'వల్లభ్'

# ★ కవి ఎన్నిక ★

కొని ఆనందిస్తున్నాడు. అడవిలో నెమలి నాట్యంచేసి ఆనందించినట్లే, అతడు తన కవిత్వాన్ని చదువుకొని తానే ఆనందిస్తున్నాడు

రాజు మంత్రితో—"చూచావా? ఈ వందమందిలో ఒక్కడే కవి. మిగిలినవాళ్లు కవులుకాదు! వారికి కావాల్సింది ఆనందం! దుఃఖంలో వారికి కవిత్వం వస్తుంది. సుఖంలో దానిని మరిచేపోతారు. కాని, కవి సర్వావస్థలందు, సుఖంలోనైనా, దుఃఖంలోనైనా కవిత్వం వ్రాస్తాడు. అతడు దుఃఖాన్ని చూచి దుఃఖించడు, సుఖాన్ని చూచి ఆనందించడు! వాడికి రెండూ ఒకటే! అందువల్ల, మన నగరంలో నిజమైన కవి ఇతనొక్కడే! ఇతడు ఒక్కడే కవి! మిగతావారి నందర్నీ గెంటేసేయి!" అన్నాడు.

ఆ తరువాత రాజు అతనిని తన ఆస్థాన కవిగా నియమించాడు. ఇప్పుడతనికి కావాల్సినంత జీతం యివ్వబడుతోంది. రోజూ ఆస్థానానికి వచ్చి, ఓ పద్యం వినిపిస్తూ వుండటం అతని పని.

కవి ఆస్థానంలోకి వెళ్లి ఒకరోజు పద్యాన్ని వినిపించాడు. రెండో రోజు వినిపించాడు, మూడోరోజు వినిపించాడు. నాలుగో రోజున— "ఈపని నావల్లగాదు. నేను మీకోసం కవిత్వం వ్రాయలేను." అని వ్రాసి పంపించాడు.

అది చూచి మంత్రి—"ఇతడు దురదృష్టవంతుడు!" అన్నాడు

కాని, మహారాజు—"కాదు, ఇతడు దురదృష్టవంతుడు కాదు! ఈనాడుమీతండ్రి, నా పాతమంత్రి వున్నట్లయితే ఎంతో సంతోషించేవాడు. అతనిని ఆరాధించివుండేవాడు. ఇతడు స్వతంత్రుడు. స్వతంత్రంగావుండి కవిత్వం వ్రాస్తాడు. బానిస కవిత్వం బానిసగానేవుంటుంది. అందువల్ల, అతని జీతం యింటికి పంపుతూవుండు." అన్నాడు.

మంత్రికి జ్ఞానోదయమయింది.

★



"వీరిని ఖైదులో పెట్టు! కఠినంగా శిక్షించు! ఇక ఎవరైతే కవిత్వం రాస్తారో వాళ్ళకి కొరడా దెబ్బలు తగులుతాయని చెప్పు."

# మాలతి

సంతోషంతో గంతు లేస్తూ, తోటలో వున్న స్నేహితురాలు, "మాలతి" దగ్గరకి చేరాడు చిట్టిబాబు. చల్లగాలి హాయిగా వీస్తోంది. చిట్టిబాబుని మాలతి ఆహ్వానించి, తన ప్రక్కనే కూర్చో పెట్టుకుంది. చిట్టిబాబు మాలతిని, తనదగ్గరగా తీసుకున్నాడు. ప్రేమగా నిమిరాడు. మంచిమంచి, కబుర్లు చెప్పాడు. మాలతీ, చిట్టిబాబూ వూగుతూ ఆడుకున్నారు కాస్సేపు.

"మాయింటికిరా, మాలతీ" అన్నాడు చిట్టిబాబు.

"నేనురాను" అన్నట్టు చూసింది. సంతోషంతో వొళ్లుమరచి వుయ్యాలూగింది.

"ఊఁ! నువ్వెప్పుడూ ఇంతే! మాట్లాడవు. నువ్వు మంచిదానివి కావు" కోపంగా అన్నాడు చిట్టిబాబు.

"అలా కోపం తెచ్చుకోకూడదు అన్నట్టుచూసి, తను దాచుకున్న పువ్వులని, చిట్టిబాబు చేతుల్లో పెట్టింది మాలతి.

"ఎంచక్కా వుంటావు, మాంచి దానివి" అన్నాడు చిట్టిబాబు పువ్వులు తీసుకుంటూ. సూర్యుడస్తమిస్తున్నాడు. చిట్టిబాబు లేచాడు ఇంటికి వెళ్లడానికి. వద్దు, వద్దని, అతని కాళ్లని చుట్టేసింది మాలతి.

"అమ్మ కొడుతుంది. రేపు వస్తాగా!" మాలతీని బుజ్జగించి వచ్చేశాడు చిట్టిబాబు. మాలతి వెళ్ళిపోతున్న తన స్నేహితుణ్ని, ఆశగా చూస్తూ అక్కడే పవళించింది బద్ధకంగా.

సరోజ

మాలతి చిట్టిబాబుల స్నేహాలత చిన్నతనంలో నేఅల్లుకుంది. మాలతి చిట్టిబాబుని చూడకున్నా, చిట్టిబాబు తెచ్చే తియ్యటి పానీయాన్ని త్రాగకున్నా వాడిపోతుంది. చిట్టిబాబుకోసం వెయ్యికళ్ళతో వెదుకుతుంది. చిట్టిబాబు పసిహృదయంలో ప్రథమ స్నేహితురాలుగా మాలతి నిలిచింది. మాలతిదగ్గరకి వెళ్ళి ఆడుకోవడమంటే చిట్టిబాబుకి ఎంతో సరదా. మాలతి బాబుకోసం ప్రత్యేకంగా తను దాచుకున్న పువ్వులు తెచ్చి ఇస్తుంది. వాటిని చిట్టిబాబు వాళ్ళ అమ్మ కిస్తాడు. 'శావున్నాయిరా' అంటుంది వాళ్ళమ్మ. "మాలతి చాలా బావుంటుందమ్మా, నువ్వు చూడు; వొక్కసారి" అంటాడు చిట్టిబాబు. "వస్తాలేరా" అంటుంది వాళ్లమ్మ. ఇది ప్రతినిత్యం జరుగుతుంటుంది.

చిట్టిబాబు ఇంట్లో అడుగుపెట్టేసరికి, వాళ్ళమ్మ సుశీల "ఎక్కడికెళ్లావురా" అంది కోపంగా.

"మాలతిదగ్గరకమ్మా. ఇవిగో పువ్వులు" చిట్టిబాబు పువ్వులిచ్చాడు.

"ఎక్కడుందిరా ఆ మాలతి?-"

"తోటలో అమ్మా-"

"తోటలోనా? అయ్యో అక్కడికెళ్లకు బాబూ, అక్కడ బూచులున్నాయిట! భయమేస్తుంది."

"బూచులా? భయమా?- మరి, మాలతికి భయంలేదే? అక్కడే

# ★ మాలతి ★

వుంటుంది నేనెప్పుడు వెళ్ళినా. పువ్వు లిస్తుంది, వుండమంటుంది. మాలతి ఎంచక్కా వుంటుందమ్మా!"

"అలాగా, ఒక్కసారి మనింటికి రమ్మనకూడదూ! రేపు తీసుకురా నువ్వు. రోజూ వెళ్ళొద్దు బాబూ అక్కడికి. ఆతోట మంచిది కాదు"

"మాలతి రాదమ్మా, చాలా సిగ్గు. నాతోనే మాట్లాడదు. ప్రతిదీ మూగగా చెబుతుంది. నాకోపం వస్తుంది. ఒక్కొకసారి ప్రేమగా పట్టి వూపుతుంది. నాకు నవ్వొస్తుంది. పువ్వులిస్తుంది. వుండమని కాళ్లని చుట్టేస్తుంది. పోవద్దని పట్టుకుంటుంది, వెళ్ళకుండా ఎలా వుండనమ్మా"

"అందుకే ఇక్కడికి తీసుకురా అంత మంచిదా ఆ అమ్మాయి."

"అవునమ్మా. వాళ్ళమ్మ 'ఎక్కడికీ వెళ్ళొద్దూ; ఇక్కడే వుండు; ఎక్కడికయినా వెళ్లావంటే జబ్బు చేసి చచ్చిపోతావ్' అని చెప్పిందట. అందుకని రాదే!"

"మరీ పువ్వు లెక్కడివి?"

"నేవెళ్ళేసరికి చేతుల్లో పెట్టుకుని వుంటుందమ్మా. నాకిస్తుంది, నావొళ్లో వాలుతుంది" చిట్టిబాబు చెప్పాడు, అబద్ధాలూ నిజాలూ కలిపి. సుశీల నవ్వింది.

"ఎలావుంటుందిటరా, మాలతి?" అంది చిట్టిబాబుకి అన్నంపెడుతూ. చిట్టిబాబు మాలతినిగురించే ఆలోచిస్తూంటాడు.

"అమ్మా, మాలతి మాట్లాడదేమ్మా?"

"సిగ్గన్నావు కదరా!"

"కాదే"

"మూగపిల్ల లుంటారురా; బహుశా మూగదేమో!"

"ఛా కాదు" మాలతి మూగదన్నందుకు చిట్టిబాబుకి వాళ్ళ అమ్మమీద కోపంవచ్చింది.

వర్షం అప్పుడప్పుడే కురుస్తోంది. మబ్బులు వస్తున్నాయి. చిట్టిబాబుని తోటలోకి వెళ్ళకుండా కాపలా పెట్టింది సుశీల. మాలతిదగ్గరకి వెళ్ళడానికి చిట్టిబాబుకి వీలు దొరకలేదు. రెండురోజులు గడిచాయి. మాలతి తనకోసం ఎదురుచూస్తూంటుంది, వానలో తడుస్తూవుంటుంది పాపం! ఏంచేస్తూందో. చిట్టిబాబుకి ఏడుపొస్తోంది. తను వెళ్ళలేకపోయాడు.

ఆరోజు అమ్మప్రక్కలో చలికి ముడుచుకొని పడుకుని అడిగాడు, "అమ్మా, వర్షంలో తడుస్తూంటే మాలతికి చలెయ్యదూ?" అని.

"అక్కడేదయినా ఇల్లుంటుంది. అందులోకి వెడుతుందిలేరా వర్షం వస్తే"

"లేదమ్మా వెళ్లదు. ఎక్కడికీ వెళ్ళదు"

"నీపిచ్చిలే. పడుకో మాట్లాడక" సుశీల మందలించింది. మరుసటి రోజైనా ఎలా తప్పించుకుని వెళ్లాలా అని ఆలోచిస్తూ నిద్ర పొయ్యాడు.

అలా అలా వారం రోజులకి ఎల్లాగో తప్పించుకుని వెళ్లేడు చిట్టిబాబు. మాలతి ఆహ్వానించ లేదు. పడుకుని వుంది. "మాలతికి కోపం వచ్చిందా నామీద" అనుకుంటూ చిట్టిబాబు వెళ్లి మాలతి ప్రక్కన కూర్చున్నాడు. మాలతి కదల్లేదు; పడుకునే వుంది. "పగలు నిద్రపోతావా? మాలతీ! లే" అంటూ చిట్టిబాబు మాలతిని లేవదీశాడు.

"హూ" అంటూ పడిపోయింది మాలతి. "అయ్యో! ఎవరు కొట్టారు మాలతి నిన్ను? నొప్పిగా వుందా? మందు రాస్తాను, ఏడవకు" మాలతి గాయాలనిచూసి చిట్టిబాబు జాలిగా అన్నాడు. మందు తెచ్చి రాస్తే మాలతికి నొప్పి తగ్గిపోతుంది. కాని ఇంటికొస్తే మళ్ళీ అమ్మ పోనిస్తుందా? మంచిమాటలు చెప్పి హాయిగా నిద్రపొమ్మని మాలతిని ఓదార్చి బయలుదేరాడు ఇంటికి మందు తెచ్చేందుకు. మళ్ళీ తప్పించుకుని రాలేకపోయాడు. మాలతి బాధల్ని తలచుకుని ఏడుస్తూ నిద్రపోయాడు. నిద్రలో కల వచ్చింది.

కలలో మాలతి చిట్టిబాబుతో "నీకోసం వారంరోజులనుంచీ

ఎన్నో పూలు దాచాను. కాని, ఎవరో వచ్చి నన్ను కొట్టి అన్నీ లాక్కుపోయారు. మళ్ళీ ఆరు నెలలదాకా నాకు పువ్వులు దొరకవు; నీకెలా ఇవ్వను" అంది ఏడుస్తూ.

"ఫరవాలేదులే మాలతీ, నేనున్నాగా, ఈసారి వాళ్ళొస్తే గుర్తుగా నాకు చెప్పు. తన్ని పంపిస్తాను" అన్నాడు చిట్టిబాబు. 'సరే' అంది మాలతి, కిలకిలానవ్వుతూ. హాయిగా ఆడుకున్నారిద్దరూ.

నిద్రలేచి చిట్టిబాబు కలనితలచుకుని నవ్వుకున్నాడు. నిజంగా 'మాలతి ఇక పువ్వులివ్వదా, పోనీ లే. ఇవ్వకపోతే పోనీ' అనుకున్నాడు. వర్షం జోరుగా కురుస్తోంది. సుశీల, పనివాళ్లూ నిద్రపోతున్నారు. ఇప్పుడే వెళ్లాలి. వర్షం తగ్గితే అమ్మావాళ్లూ లేస్తారు. వర్షంలో పరుగు తీశాడు చిట్టిబాబు. పడ్డాడు. బట్టలు మురికయ్యాయి. లేచి మళ్ళీ పరుగు తీశాడు. తోటలో కెళ్ళేసరికి వాన జల్లులు అధికమయ్యాయి. ఒక్కవుదుటున మాలతిదగ్గరికి పరుగు తీశాడు. మాలతి వర్షంలోతడుస్తూ, చలికి వణికిపోతోంది. చిట్టిబాబు మాలతిని కౌగిలించుకుని కూర్చున్నాడు. వర్షం తగ్గలేదు. తడిసి ముద్దయ్యాడు కాని ఎలా వెళ్ళడం. తల తిరుగుతోంది. వొళ్లంతా నొప్పి. అలాగే వున్నాడు మాలతి ప్రక్కన. ఎవరో గొడుగేసుకుని వస్తున్నారు. ఎవరు ? నాన్న!... చూస్తే చంపేస్తారు. కొట్టారు.

చిట్టిబాబు లేచి సంపెంగ పొద ప్రక్కన దాక్కున్నాడు. గుండెలు అతివేగంగా కొట్టుకుంటున్నాయి. చలి కొరికేస్తోంది.

కాంతారావు (నాన్న) తోటలో కొచ్చి వెదుకుతున్నారు. "చిట్టిబాబూ" అని అరిచారు. నాన్న అటువెళ్లడంచూసి చిట్టిబాబు పరుగు లంకించుకున్నాడు ఇంటికి. సుశీల వచ్చి చిట్టిబాబులాగూ చొక్కా విప్పేసి, తల తుడిచి, చలి కాచి, సేవలు చేసింది. చిట్టిబాబు తల నొప్పికీ, చలికీ అల్లాడిపోతున్నాడు.

తెల్లవారేసరికి చిట్టిబాబువొళ్లు కాలిపోతోంది. సుశీల చిట్టిబాబుని చూసి, "ఎవర్రా ఆమాలతి? ఎందు కెళ్ళావురా?'' అని బాధగా అరుస్తోంది. కాంతారావు డాక్టర్ని తీసుకుని వచ్చాడు. మందిచ్చారు. జ్వరం, తగ్గలేదు. "మాలతి తడుస్తోంది. మాలతికి జ్వరం వస్తుంది. తీసుకురండి!'' చిట్టిబాబు పిచ్చిగా కలవరిస్తున్నాడు. "మాలతిని తీసుకొచ్చారా'' చిట్టిబాబు ప్రతీరోజూ జ్వరంలో అడుగుతూనే వున్నాడు. చుట్టుపక్కల మాలతి పేరు గల పిల్లలందర్నీ తీసుకునివచ్చి చూపించారు. 'ఛీ! వీళ్లు కాద'ని మండి పడ్డాడు చిట్టిబాబు. తోటలో ప్రతీ రోజూ చూడమనీ ఎవరేనా పిల్ల వస్తే పట్టుకురమ్మనీ, కాంతారావు కాపలా పెట్టాడు. కాని మాలతి అనే పేరుగల పిల్ల ఎవరూ రాలేదు. కాంతారావూ, సుశీలా విసిగి పోయారు. చిట్టిబాబుకి జ్వరం తగ్గుముఖం పట్టింది. నెలరోజులకి చిట్టిబాబు కోలుకున్నాడు. "అమ్మా!- నాన్నా! తోటలోకి ఒక్కసారి - ఒక్కసారంటే ఒక్కసారే - వెళ్ళొస్తానే'' చిట్టిబాబు జాలిగా అడిగేవాడు. తప్పించుకుని వెళ్దామన్నా, కాపలావాడు లోనికి వెళ్ళనివ్వడంలేదు. ఎంతోమంది పిల్లలు ఆటకొస్తారు. కాని చిట్టిబాబు వాళ్ళతో ఆడుకోడు. ఆడుకుంటే మాలతి నున్నని వేళ్ళతో ఆడుకోవాలి. మాలతితో ఆడుకోవాలనీ చిట్టిబాబు వాంఛ.

మాలతి ఏమయిందో! ఏమో!... మాలతీ!...చిట్టిబాబుకి మాలతి మీద కలవరం ఎక్కువయింది. ''ఒక్కసారి ఆడుకుని వస్తానే'' నిద్రలో కలవరిస్తున్న చిట్టిబాబుని చూసి సుశీల, కాంతారావు కంగారుపడ్డారు. మర్నాడు చిట్టిబాబుని తోటలోకి తామే తీసుకెళ్లాలని నిర్ణయించుకొన్నారు. చిట్టిబాబు ఆనందంతో గంతులేశాడు. అమ్మా నాన్నలతో బయలుదేరాడు చిట్టిబాబు స్నేహితురాలు మాలతి దగ్గరికి.

తోటలో కెళ్ళిందే తడవుగా 'మాలతీ' అంటూ ఏడ్వడం మొదలెట్టాడు చిట్టిబాబు. ''ఏమిటి ? ఎందుకు?'' అమ్మా నాన్నా అడి

## ★ మాలతి ★

గారు. కాని చిట్టిబాబు ఏడుపు మానలేదు. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. "మాలతీ! నిన్నెవరో చంపేశారు. నేను రాకుండా చూసి చంపేశారు." సుశీల కాంతారావు నిర్ఘాంతపోయ్యారు. చిట్టిబాబు పడివున్న దగ్గరనుంచి లేవదీసేసరికి, ఎండి విరిగిపోయివున్న మాలతీతీగె కన్పించింది. ఎండిపోయిన తీగెలని పట్టుకుని "కొట్టిచంపారు, గిల్లిచంపారు" అని ఏడుస్తున్నాడు చిట్టిబాబు. సుశీలకీ, కాంతారావుకీ నవ్వూ, ఏడ్పూ వచ్చాయి.

ఒక్క మాలతీతీగెకోసమా బాబు ఇంత ఏడుస్తున్నాడు! వాడికి ఈ మాలతేనా ఇంత స్నేహితురాలు. అవ్యాజానురాగమంటే ఇలాంటిదే కాబోలు. ఒక్క పసిహృదయం, నోరులేని చిన్న పూలతీగె ఎంత సన్నిహితులయ్యారు! "నేనే రెండు నెలల క్రితం వీణ్ణి ఈ తోటలోకి తీసుకునివచ్చినప్పుడు 'ఇది మాలతి చెట్టు' అని చెప్పాను" అన్నారు కాంతారావు సుశీలతో. "మాలతి నామాలతిఅంటూ" విరిగిన తీగెలని తీసుకుని ఏడుస్తున్న చిట్టిబాబుని తీసుకుని వెళ్తూ, "మనింట్లో కావలసినన్ని మాలతి మొక్కలు పెడ్దాంబాబూ" అని సముదాయించారు. చిట్టిబాబు పోయిన మాలతికోసం బాధపడని రోజు లేదు.

నా క్రిందటే చిట్టిబాబువాళ్ళింటికి వెళ్లాను. వాళ్ళ కంపౌండు హాలూ గార్డెన్ అంతా మాలతీ తీగెలమయం గావుంది. "ఏరా, చిట్టిబాబూ, ఇలా మాలతీ తీగలమయం చెయ్యకపోతే వేరే చెట్లు లేవా? అన్నాను."

"అదికాదురా" అని పైకథ వివరించాడు. తన చిన్నతనంలో మాలతి తీగెలన్నా, మాలతి పూలన్నా అంత ఆశ అట. అది మొక్క అని చెప్పక అబద్ధాలు చెప్పి తను వాళ్ల అమ్మానాన్నని ఎలా ఏడిపించాడో చెప్పి నవ్వాడు. ఆనాటికీ, ఈనాటికీ, చిట్టిబాబుకి మాలతి అంటే అమిత ప్రేమ. గంధపుగిన్నెల్లావుండి తెల్లగా చిన్న చిన్న పూలగుత్తులుగా వుండే మాలతిపూలంటే చిట్టిబాబుకి యింతింత అనలేని ఇష్టం. ఆశ్చర్యమేమిటంటే, వాడి మిసెస్ పేరుకూడా మాలతే. కేవలం ఆ పేరు చూసే ఆమెని "మ్యారేజ్" చేసుకున్నాడా చిట్టిబాబు? ★

(25-వ పేజీ తరువాయి)

"నా దగ్గరేముంది?" పెదిమ విరిచాడు దత్తాత్రేయం.

"బాగుంది నాటకం!" అంది రాధిక.

"నాటకమేమిటి? మీ నాన్న పంపిన సొమ్ము తీసుకురా"

"ఔను. దానిమాటే నేనూ చెప్తున్నాను. పొద్దున్న మీ కిచ్చిన కవర్లో పెట్టాను. కొంపతీసి పారేశారేమిటి?" తెల్లబోయింది రాధిక.

దత్తాత్రేయం మేకపోతుగాంభీర్యం చూపించాడు - "ఎక్కడికి పోతుంది! టేబుల్ మీదే వుండివుంటుంది." అన్నాడు.

"ఆ. వుంటుందిలెండి!" వెక్కిరించింది రాధిక.

దత్తాత్రేయం గదిలోకి పరిగెత్తాడు. టేబుల్ మీది కాయితాలన్నీ తిరగేసి చూశాడు. కవరు కనిపించలేదు. డ్రాయర్లు వెతికిచూశాడు. టేబుల్ చుట్టూ చూశాడు. జేబులు దులిపాడు. మొత్తంమీద గదంతా గాలించాడు. ఎక్కడా కనిపించలేదు.

"రాధా! నువ్వు కవరు తీసుకోలేదూ?" అన్నాడు సందేహిస్తూ.

"బాగుంది వరస! నేను తీస్తే మిమ్మల్నెందు కడుగుతాను?" ఎదురు ప్రశ్న వేసింది రాధిక.

"అది సరేకాని, నోటు వెంటనే తీసి దాచుకోవద్దూ! తెలివి తేటలు!" అన్నాడు దత్తాత్రేయం తప్పు తనదికాదన్నట్టు.

రాధిక ఈ మాటకు జవాబియ్యలేదు. హేళనగా ఒకసారి తలూచి "జేబులు చూశారా?" అంటూ భర్తని క్రాస్ ఎగ్జామిన్ చేయటం మొదలు పెట్టింది.

"చూశాను." అన్నాడు అతను.

"టేబుల్ డ్రాయర్లు?"

"చూశాను. వాటిలోనూ లేదు."

"మధ్యాహ్నం మీరు లోపలికి వచ్చిం తర్వాత గదిలోకి యెవరైనా వెళ్లారా?"

దత్తాత్రేయం చూపుడువేలితో తాళువ మీద ఒకసారి కొట్టుకున్నాడు. ఆ తర్వాత "దాలెమ్మ వెళ్లింది గది తుడవడానికి." అన్నాడు.

"అయితే దాలెమ్మదే యీ దెబ్బ!" అంది రాధిక.

దత్తాత్రేయం యెటూ నిర్ణయించలేకపోయాడు. ఏమనడానికీ నోరు పెగిలింది కాదు. దాలెమ్మ దొంగతనం చేసిందనడానికి తగిన నిదర్శనమూ వుంది. చేయలేదనడానికి అవకాశమూ వుంది. దాలెమ్మ యింతకు ముందెప్పుడూ యిటువంటి పాడు పని యెక్కడా చేయలేదు. ఇప్పుడు చేసిందనడానికి నమ్మకమేమిటి? ఏమో! డబ్బు పాపిష్టిది. ఎంత మంచివాళ్లనైనా పెడత్రోవల్లో పెడుతుంది. ఆలోచిస్తూ నిల్చుండిపోయాడు. రాధిక కూడా యీ మాటే అంది.

"దాని నమ్మకం మనకేమిటి? చూసిన తరువాత తీసుకోకుండా వుంటుందా! గదిలోకి వెళ్లిన తర్వాత కవరు దాని కళ్లబడకుండా వుంటుందా? రేప్పొద్దున్న రానీండి; దాని భరతం పట్టిస్తాను."

దత్తాత్రేయం మౌనంగా వూరుకున్నాడు.

మర్నాడు వుదయాన దాలెమ్మ పాచిపనికి వచ్చింది. లోపలకు రాగానే అడిగింది రాధిక-"ఏమే నిన్నను వీధిగది తుడిచావా?" అని.

ఔనన్నట్టు తలూపింది దాలెమ్మ.

"టేబుల్ మీది కాయితాలు సవరించావా?" కూపీలు లాగయత్నించింది రాధిక.

"కొత్తగా అడుగుతున్నారేఁవమ్మా?" మామూలు ధోరణిలోనే అంది దాలెమ్మ.

"టేబుల్ మీది కవరు యేంచేశావ్?" ఈ ప్రశ్న మాత్రం కఠినంగానే అడిగింది రాధిక.

దాలెమ్మ ఈ ప్రశ్నకు సరియైన సమాధానం చెప్పలేకపోయింది. మొదట్నించీ రాధిక ధోరణి ఆమెకు వింతగానే కనిపించింది. ఇప్పుడీ ప్రశ్నతో భయం కూడా వేసింది.

"నే నెరగనమ్మా!" అన్నది అమాయకంగా చూస్తూ.

"నిజం చెప్పు! లేకపోతే నిలువునా చీరేస్తాను! టేబుల్ మీదవున్న కవరు నువ్వు తియ్యలేదూ?" రౌద్రాకారం దాల్చాడు దత్తాత్రేయం.

"నంగనాచి కబుర్లు మాని కాజేసిన పది రూపాయలు బయటపెట్టు" అన్నది రాధిక.

దాలెమ్మ గడగడా వొణికిపోయింది. లబోదిబోమని మొత్తుకుంది. ఏ పాపం యెరగనని యేడ్చింది.

రాధిక నయానా భయానా అడిగింది. పోలీసులకు అప్పజెప్తానని భయపెట్టింది. "ఎలా తీశావో ఆలాగే పడేయ్" అని మంచిగానూ చెప్పిచూసింది. కాని ఫలితం బండిసున్నా అయింది.

ససేమిరా నేను తియ్యలేదు అన్నది దాలెమ్మ. ఏ ఒట్టు వేయమంటే ఆ ఒట్టు వేస్తానంది. చివరకు మెళ్లో వున్న మంగళసూత్రం పట్టుకునికూడా ప్రమాణం చేసింది.

కాని రాధకు దాలెమ్మమీద అనుమానం తీరలేదు. దత్తాత్రేయం కూడా చేసేది లేక దాలెమ్మను తక్షణం పనిలోంచి తొలగించాడు. చేసినంతమట్టుకైనా జీతం యివ్వకుండా తగిలేశాడు.

నెల్లాళ్ళ తరవాత ఓ రోజు మధ్యాహ్నం మిడిమిడి ఎండలో యింటికి వొచ్చాడు దత్తాత్రేయం.

"అబ్బ! ఫెళ్ళుమంటూంది ఈ వాళ ఎండ" అన్నాడు చొక్కా విప్పి గోడనున్న మేకుకి తగిలిస్తూ.

"నిన్నను హోరుమని వానకురిసింది కదూ! అంచేత ఫెళ్ళుమంటూంది ఈవాళ ఎండ. మబ్బు విడిచిన ఎండమరి" అన్నాది రాధిక మంచంమీద నడుం వాలుస్తూ.

"తల దిమ్మెక్కిపోయింది. కొంచెం కాఫీనీళ్లుపడేద్దూ!" అన్నాడుదత్తాత్రేయం.

రాధిక సహజంగా చురుగ్గా తిరుగుతుంది. కాని ఒకప్పుడు కాకపోతే మరొకప్పుడైనా బద్ధకం కలగడం మానవులకు సహజం! అందులోనూ అప్పటివరకూ వంటింటి పనుల్లో వొళ్లు మొద్దయిపోయివుందామెకు. అంచేత తప్పించుకోడానికి దారిచూసింది.

"బొగ్గులు చెమ్మగా వున్నాయండీ! నిన్నటి వానలో తడిసిపోయాయి" అన్నది.

దత్తాత్రేయం మాత్రం కనికరించలేదు. పైగా రాధిక సమాధానంకూడా అంత నమ్మతగ్గదిగా అతనికి తోచలేదు.

"పర్వాలేదులే. మరి నాలుగు కాయితాలు మంటబెడితే మహారాజులా నిప్పవుతుంది" అన్నాడు సులువుగా.

రాధిక విసుక్కుంది. "సరే. చిత్తు కాయితాలు ఓ నాలుగు నా మొహాన పారెయ్యండి" అన్నది కుంపట్లో బొగ్గులువేస్తూ.

దత్తాత్రేయం అంతకూ వెనక తగ్గలేదు.

"కాయితాలకేం కరువొచ్చింది! చిత్తు కాయితాల బుట్ట తిరగేస్తే కుప్పలు కురుస్తాయి. బద్ధకించక వెళ్లు." అని ఆజ్ఞచేశాడు.

చికాగ్గా వెళ్లి చిత్తుకాయితాల బుట్టలో చెయ్యి దూర్చింది రాధిక. చేతికి చిక్కిన నాలుగు కాయితాలు తెచ్చి కుంపట్లో పెట్టింది. అగ్గిపుల్లగీస్తూ కుంపట్లోకి చూసి నిస్పృహతో నిశ్వసించింది.

చేతిలోవున్న అగ్గిపుల్ల ఆమె నిట్టూర్పు గాలికి ఆరిపోయింది. వెంటనే దత్తాత్రేయాన్ని పిల్చింది - "ఏమండీ! ఇలా చూడండి!"

దత్తాత్రేయం ఒక్క క్షణంలో ప్రత్యక్షమయ్యాడు. రాధిక, నోట మాటాడక కుంపట్లో దగ్ధం కావడానికి నలిగిపోయి సిద్ధంగావున్న, పదిరూపాయల నోటుని మడత విప్పి చూపెట్టింది.

"ఎంతపని చేశాం రాధా! దాలెమ్మని అనవసరంగా అనుమానించాం! నిందించాం! ఈపాపం యెలా పోతుంది?" కించపడ్డాడు దత్తాత్రేయం.

రాధిక మెల్లగా సణుగుతూ - "పాపిష్టి డబ్బు! దగ్ధం కానివ్వండి?" అంటూ నోటు ముట్టించివేసింది. ★




ఎన్నేళ్లకీ ఎదగని బాలుడు పీటర్ పాన్.




దేవకన్య టింకర్ బెల్.

సర్ జె. ఎమ్. బారీ వ్రాసిన జగద్విఖ్యాత నాటకం "పీటర్ పాన్" (1904) కథ ననుసరించి వాల్ట్ డిజ్నీ కార్టూన్‌చిత్రం నిర్మించాడు. ఈ చిత్రం త్వరలో మద్రాసు రానున్నది. ఈ చిత్రం తాలూకు స్టిల్స్ ఆధారంగా "పీటర్ పాన్" కథను సీరియల్ గా ప్రకటిస్తున్నాము.

మానవజీవితంమీద అలౌకిక శక్తుల ప్రభావాన్ని నిరూపిస్తూ జె. ఎమ్. బారీ ఇంగ్లీషులో అనేక నాటకాలు వ్రాశాడు. "పీటర్ పాన్" నాటకంలో ప్రధానంగా బాలబాలికల మనస్తత్వం అతి మనోహరంగా చూపించబడుతుంది. కథానాయకుని పేరు పీటర్ పాన్.

(**1**) పీటర్ పాన్ వయస్సెంతో ఎవరికీ తెలియదు. ఒకటిమాత్రం నిశ్చితంగా తెలుసు; అతడు నిత్యబాలుడు; అతనికి వయస్సు లేదు; బాల్యం పోదు; వృద్ధాప్యం రాదు; మరణం లేదు; వ్యాధి రాదు; అతడు అమరజీవి. అతని జీవితంలో ఎప్పుడూ వసంతఋతువే; ఎప్పుడూ ఆనందమే. అతడు ప్రపంచమంతటా, ఎక్కడెక్కడ బాలబాలికల అమాయక మధుర దరహాసాల వెన్నెలలు వెలుగుతూంటాయో అక్కడక్కడ ప్రత్యక్షమవుతాడు. ఇష్టమైతే చిన్నపిల్లలతో కొంతసేపు ఆడుకుంటాడు. చిన్నపిల్లలకి మాత్రమే కనిపిస్తాడు; పెద్దవాళ్లకి కనిపించడు. పెద్దవాళ్ల మనస్సులు సౌకుమార్యం కోల్పోయి, సౌందర్యం మరిచిపోయి, బండబారి వుంటాయి. అటువంటి వాళ్లకి నిత్యబాలుడు పీటర్ పాన్ కనిపించడు. ప్రపంచమంతటా తిరుగుతున్నా, అతనికి వేరే స్వంత ప్రపంచం వుంది. ఎక్కడో కొండలుదాటి, కోనలుదాటి, సముద్రాలుదాటి పోగాపోగా, ఒక చక్కని ద్వీపం ఉన్నది; ఆద్వీపమే అతని రాజ్యం. అక్కడ వింత వింత చెట్లు, పువ్వులు, పళ్లు, పిట్టలు వుంటాయి. చెట్ల చిటారు కొమ్మలమీద పక్షులతోపాటు దేవకన్యలుకూడా

ఆర్. కె. ఓ. రేడియోవారి
సౌజన్యంతో

నివసిస్తారు. కనుచూపుమేర దూరంలో కనిపించే సముద్రపు పాయలో నాగకన్యలు నివసిస్తారు. ఎవ్వరూ కనిపెట్టలేని ఒకానొక రహస్యప్రదేశంలో, భూగర్భంలో చక్కని చిన్న యిల్లు కట్టుకుని పీటర్ పాన్ నివసిస్తాడు. అతనితోపాటు మరికొందరు బాలురుకూడా వుంటారు. వారు కూడా ఎప్పటికీ వయస్సురాని చిన్నపిల్లలే కాని, వారికి పీటర్‌కున్న తెలివితేటలు, బలం లేవు. వాళ్లకి అతడే నాయకుడు. వీళ్లందరూ కలిసి ఆ ద్వీపంలో విచ్చలవిడిగా తిరుగుతూ, మహా సాహసకృత్యాలు చేస్తూ, చెట్లమీద కెగిరి దేవకన్యల రెక్కలు పట్టుకులాగుతూ, సముద్రంలో యీదులాడి నాగకన్యలను ఏడిపిస్తూ హాయిగా గడుపుతూ వుంటారు.

(**2**) పీటర్ పానుకు 'టింకర్ బెల్' అనే దేవకన్య స్నేహితురాలున్నది. ఈమె మాట్లాడితే మువ్వలు కిణకిణమన్నట్లుంటుంది. అసలు దేవకన్యల భాష మువ్వలు కిణకిణమన్నట్లే వుంటుంది. ఆభాష పీటర్‌కు వచ్చుగాని, ఆభాషలో మాట్లాడడమంటే అతనికి తలనొప్పి. అందుకని తనుమాత్రం తనభాషలోనే మాట్లాడుతాడు.

ఒకరోజున ఇద్దరూ కలిసి లండన్‌లో ఒకయింటికి వచ్చారు. ఆయిల్లు బ్లూమ్స్‌బరీ పేటలో ఒక సందు చివర వున్నది. ఆయింట్లో ముగ్గురు పిల్లలున్నారు. ఆడపిల్ల 'వెండీ' పెద్దది; తరవాత పెద్దతమ్ముడు 'జాన్'; వాడి తరవాతవాడు 'మైకేల్'. వాళ్లనాన్న పేరు జార్జి డార్లింగ్; తల్లి మేరీ డార్లింగ్. నాన్న ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ కుటుంబాన్ని పోషించుకుంటున్నాడు. పిల్లల సంరక్షణకు ఒక దాదిని పెట్టడం అవసరం. కాని జీతమిచ్చి దాదిని పెట్టుకునే తాహతులేక, ఒక కుక్కను పెంచారు. దానిపేరు 'నానా'. మహా తెలివైనది. ముగ్గురుపిల్లల్నీ అదే స్నానం చేయిస్తుంది; బట్టలు తొడుగుతుంది; అన్నానికి తీసుకొస్తుంది; పక్కలమీద పడుకోబెడుతుంది; స్కూలుకీ, షికారుకీ తీసుకుపోతుంది.

ఈయింటికి పీటర్, తన మిత్రురాలు టింకర్ బెల్‌తో కలిసి వచ్చాడు. అతడు తనతల్లిని ఎరగడుకదూ. అందుచేత మంచి మంచి కథలూ అవీ తెలియవు. ఎక్కడెక్కడ తల్లులు పిల్లలకు కథలు చెబుతూంటారో అక్కడికి పోయి చాటుగా వుండి కథలు విని చక్కాపోతూంటాడు. ఒకరోజున వెండీ, జాన్, మైకేల్‌లకు వాళ్లమ్మ సిండరెలా కథ చెబుతూంటే, పీటర్ చాటుగా వుండి విన్నాడు. ఇంతలోకే అతన్ని మేరీ డార్లింగ్ పసిగట్టింది. వెంటనే పీటర్ తెరిచివున్న కిటికీలోంచి పారిపోబోయాడు. కుక్క 'నానా' అతనిమీదికి దూకి కిటికీ మూసివేసింది. పీటర్ గబుక్కున పారిపోయాడుగాని అతని నీడ కిటికీలో చిక్కుకుపోయింది.

తన నీడను తెచ్చుకునేందుకు పీటర్ పాన్ చాలరోజులనుంచి డార్లింగ్‌ల యింట్లోకి రావాలని చూస్తున్నాడు. కాని యింట్లో యెప్పుడూ యెవరో ఒకరు ఉండడంవల్ల, కుక్క 'నానా' మెలకువగా వుంటూ ఉండడంవల్లా రాలేకపోయాడు. పైగా మేరీ డార్లింగ్ పీటర్ నీడని చుట్టి పెట్టి డ్రాయర్లో దాచేసింది.

ఆరోజు రాత్రి జార్జి డార్లింగ్, మేరీ డార్లింగ్ ఎవరో విందుకు పిలిస్తే వారి యింటికి వెళుతున్నారు. పిల్లల్ని ఇంట్లోనే వదిలిపెట్టారు. అమ్మ ముగ్గురికీ పక్కలు వేసి పడుకోబెట్టింది. తండ్రి జార్జి డార్లింగ్ తన కొత్తకోటును ఖరాబు చేసిందని 'నానా'మీద కోపంవచ్చి దాన్ని తీసుకుపోయి పెరట్లో కట్టివేశాడు. అందుచేత పిల్లల కెవరూ రక్షణలేరు. పిల్లలు నిద్రపోతున్నారు.

ఇదే సమయమనుకుని పీటర్ పాన్, టింకర్ బెల్ కిటికీలోంచి లోపలికి వచ్చారు. నీడకోసం యిల్లంతా వెదికారు. టింకర్ బెల్ డ్రాయర్లో దూరి "ఇదిగో నీ నీడ" అని బైటికి తీసింది. పీటర్ పాన్ తన నీడను జిగురుతో అతికించుకుందామని ప్రయత్నించాడు. కాని అది అతకలేదు. ఏడుస్తూ కూర్చున్నాడు.

**(3)** ఈ యేడుపు విని 'వెండీ' లేచింది. ఆమె చక్కని చుక్క; అందాల బరిణె.

"ఎవరబ్బాయ్ నువ్వు? ఎందు కేడుస్తున్నావ్?" అని అడిగింది.

"నా పేరు పీటర్ పాన్. నా నీడ నాకు అతుక్కోవడం లేదు. నీ పేరేమిటి?" అన్నాడు పీటర్.

"నా పేరు 'వెండీ మోయిరా ఏంజిలా డార్లింగ్" అని పీటర్ కంటె తనకు పెద్దపేరుందని గర్వపడుతూ చెప్పింది. నీడని కుడితేగాని అతుక్కోదని చెప్పి, కుట్టిపెట్టింది. పీటరూ, అతని నీడా తాము ఒకరినొకరు మళ్లీ కలుసుకున్నందుకు సంతోషం పట్టలేక యిద్దరూ నృత్యం చేశారు.

పీటర్ తనకు తల్లి లేదని చెప్పాడు. వెండీ జాలిపడింది. "నీ కెన్నే"ళ్లని అడిగింది. ఎన్నేళ్లో తెలియదనీ, మొత్తానికి చిన్నపిల్లడి నేననీ, తాను పుట్టినరోజునే పారిపోయాననీ చెప్పాడు.

"ఎందుకు పారిపోయావు?" అని వెండీ అడిగింది.

"మా నాన్న, అమ్మ, నేను పెద్దయ్యాక మంచి వుద్యోగం చేస్తాననీ, ఇంకా ఏమి టేమిటో మాట్లాడుకుంటున్నారు. అది



వెండీ డార్లింగ్ నిద్రలేచింది.

# ★ పీటర్ పాన్ ★

విని నాకు పెద్దవడం అంటే అసహ్యం వేసింది. ఎప్పుడూ చిన్నవాణ్ణిగానే వుండాలని నా కోరిక. అందుకని పారిపోయి దేవకన్యల లోకంలోనే వుండిపోయాను."

"పీటర్! నువ్వు దేవకన్యల్ని ఎరుగుదువా?"

"ఓ. కాని యిప్పుడు చాలమంది దేవకన్యలు చనిపోయారు. ప్రపంచంలో మొట్టమొదట పుట్టిన శిశువు నవ్విన మొట్టమొదటి నవ్వు వెయ్యిముక్కలుగా పగిలింది. ఆ ముక్కలు రెక్కలు కట్టుకుని ఎగిరిపోయి దేవకన్యలయినాయి. ఆ తరవాత ప్రతి శిశువు నవ్విన మొదటినవ్వూ ఒక దేవకన్యగా మారిపోతూవుంది. కాని యీ రోజుల్లో పిల్లలు తెలివి మీరారు. దేవకన్యలుంటారంటే చాలమంది పిల్లలు నమ్మరు. "నాకు దేవకన్యల్లో నమ్మకంలేదు" అని ఒక్కొక్క పిల్లడు అన్నప్పుడల్లా ఒక్కొక్క దేవకన్య ఆకాశంనుంచి రాలి చనిపోతుంది."

"పాపం!" అని వెండీ జాలిపడింది. "నువ్వు వుండేదెక్కడ?" అని అడిగింది.

పీటర్ తన ద్వీపంగూర్చి చెప్పాడు. అక్కడ ఎంత బావుంటుందోనని వెండీ మనసులో సంబరపడింది.

"అయితే నువ్వు మా యింటికెందుకొచ్చావు?" అని అడిగింది.

"మాకు మా రాజ్యంలో కథలు చెప్పేందుకెవరూ లేరు. అందుకని మీదగ్గర కథలు విందామని వచ్చాను. పిచ్చికలు యిళ్లచూరుల్లో గూళ్ళు ఎందుకు కట్టుకుంటాయో తెలుసా? మనుషులు పిల్లలకి చెప్పేకథలు వింటానికే. అన్నట్టు సిండరెలా కథ నేను చివరిదాకా వినలేదు. చివరికేమవుతుంది?"

"చివరికి సిండరెలా కాలికి గాజుచెప్పు సరిపోతుంది. అప్పుడు యువరాజు ఆమెను పెళ్ళిచేసుకుంటాడు."

"బలే. చాల బావుంది. అయితే నేనిప్పుడే మా రాజ్యంపోయి నా స్నేహితులకో యీ కథ చెప్పివస్తాను."

"ఆగు, పీటర్. నాకింకా ఎన్నో మంచి కథలు వచ్చు."

"అయితే నువ్వుకూడా నాతోరా. ఇద్దరం యెగిరిపోదాం."

"నీకు యెగరడం వచ్చా?" అని ఆశ్చర్యపోయి అడిగింది వెండీ.

(**4**) పీటర్ తనకు యెగరడం, నడవడం రెండూ సమానమేనన్నాడు. కావలిస్తే వెండీకికూడా నేర్పుతానన్నాడు.

"మాతమ్ముళ్లు జాన్, మైకేల్‌లకు కూడా నేర్పుతావా?"

"ఓ."

"అరేయ్, జాన్! మైకేల్! లేవండిరా. ఇక్కడో అబ్బాయి వున్నాడు. అతడు మనకి యెగరడం నేర్పుతాట్ట." అని నిద్రపోతున్న తమ్ముళ్లను మేలుకొలిపింది.

పీటర్ యెగిరి తన గొప్పతనం చూపించాడు. అది చూసి జాన్‌కు యెగరడమంటే చాలా తేలికనిపించింది. తనుకూడా యెగరబోయాడు. కాని చేతకాలేదు.

ఎగరడమెలాగని జాన్ అడిగాడు.

"ఏమీలేదు. అందమైన మంచిమంచి ఆలోచనలు మనస్సులోకి రానివ్వాలి. ఆ ఆలోచనలే మనల్ని ఆకాశవీధుల్లోకి తీసుకుపోతాయి," అన్నాడు పీటర్ పాన్.

జాన్ మంచిమంచి ఆలోచనలు తెచ్చుకుని మళ్లీ యెగరడానికి ప్రయత్నించాడు. మళ్ళీ చతికిలపడ్డాడు.

"ఆగు మరీ. నేను మాదేశపు పుప్పొడి మీమీద జల్లితేగాని మీరెగరలేరు," అని పీటర్ వాళ్లమీద కొంత పుప్పొడి చల్లాడు. అప్పుడు వెండీ, జాన్, మైకేల్ ముగ్గురూ గాలిలోకి తేలిగ్గా యెగరగలిగారు. గదిలోనే కొంతసేపు యెగిరిన తర్వాత జాన్ అన్నాడు: "మనం ఇక బయటికి యెగిరిపోవచ్చనుకుంటా."

"తొందరపడకు. జాగ్రత్తగా వెళ్లాలి. దోవలో సముద్రపు దొంగల కంటపడకుండా పోవాలి," అన్నాడు పీటర్ పాన్.

సముద్రపు దొంగలనేసరికి జాన్‌కు ఎక్కడలేని ఉత్సాహం పొంగి పొర్లింది. "ఊ, త్వరగా, త్వరగా పోదాం," అన్నాడు.

(**5**) కిటికీ బయట దేవకన్య టింకర్ బెల్ వీరికోసం యెదురుచూస్తోంది.

"వెండీ! త్వరగారా, పోదాం" అని పిలిచాడు పీటర్ పాన్.

(**6**) దేవకన్య టింకర్ బెల్‌ను దూరంనుంచి చూస్తే కాళ్ళూ, చేతులూ ముఖం యేమీ కనిపించవు. ముద్దకట్టిన తేజస్సు

(53 వ-పేజీ చూడండి)



# అదీ - ఇదీ



ఫిల్మిస్తాన్ కంపెనీ చిత్ర నిర్మాత శశిధర్ ముఖర్జీ ఇటీవల ఒక వ్యాసంలో, భారతప్రభుత్వం ఫిలిం పరిశ్రమపట్ల చూపుతున్న నిరాదరణను ఖండించారు. ఇతర దేశాల్లో, ముఖ్యంగా బ్రిటన్, ఇటలీ, అమెరికాలలో ప్రభుత్వం ఫిలిం పరిశ్రమకు అత్యధిక సహాయం చేస్తోందనీ, ఈ సహాయం వల్ల ఆదేశాల్లో పరిశ్రమ ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా నిలవగలుగుతోందనీ ఆయన అన్నారు. ఉదాహరణకు బ్రిటన్‌ను తీసుకుని పరిశీలిస్తే, ప్రభుత్వసహాయం బాగా వ్యక్తమవుతుంది. అమెరికన్ చిత్రాల పోటీకి బ్రిటిష్ చిత్రాలు మొదట్లో తట్టుకోలేకపోయేవి. ఎన్నో స్టూడియోలు, సినిమా థియేటర్లు మూసివేయబడడంకూడా జరిగింది. బ్రిటిష్ చిత్ర నిర్మాతలందరూ ప్రభుత్వసహాయం అర్థించారు. ప్రభుత్వం జోక్యం చేసుకుని, ఒక నిష్పత్తిప్రకారం బ్రిటిష్ చిత్రాలు అమెరికాకు ఎగుమతి అయ్యేటట్లు, అమెరికన్ చిత్రాలు బ్రిటన్‌కు దిగుమతి అయ్యేటట్లు శాసనం చేసింది. దీనివల్ల బ్రిటిష్ చిత్రాలకు అమెరికాలో విధిగా ప్రదర్శన సౌకర్యాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఇదిగాక బ్రిటిష్ ప్రభుత్వం ఫిలిం ఫైనాన్సు కార్పొరేషన్ స్థాపించి చిన్న చిన్న నిర్మాతలకు, అర్హులైనవారికి తేలికగా పెట్టుబడి ధనం లభ్యమయేలాగ చేసింది. ఇండియాలో ప్రభుత్వం యిలాటి సహాయా లేమీ చేయకపోగా ఫిలిం పరిశ్రమను చెత్తగా పరిగణిస్తోందనీ, ముందు "మీ చిత్రాలస్థాయిని బాగుచెయ్యండి. తరువాత మా సహాయంకోసం రండి," అని బెదరగొడుతోందనీ ముఖర్జీ అన్నారు.

ఈ విమర్శ సత్యదూరం కాదు. స్వాతంత్ర్యం వచ్చిన తరవాత మొదటినుంచీ మన జాతీయ ప్రభుత్వం ఫిలిమ్ పరిశ్రమను నిరాదరణతోనే చూస్తున్నది. మన చిత్రాల స్థాయి ప్రభుత్వానికి నచ్చినంత ఉన్నతంగా లేకపోవచ్చుగాని అసలు యేదో వొక స్థాయి, కొన్ని మంచి చిత్రాలూ, కొన్ని చెడ్డచిత్రాలూ అంటూ వున్నాయి గదా. అన్ని పరిశ్రమల లాగానే ఫిలిం పరిశ్రమను కూడా పరిగణించక పోవడానికి పెద్ద అభ్యంతరా లేమీ లేవు. ఈ పరిశ్రమలో అరాజకం ఎక్కువగా వుందని ప్రభుత్వం భావించడం సబబే కావచ్చు. అయితే కొన్ని కోట్ల జనానికి అత్యంత సన్నిహితంగా, వినోదదాయకంగా తయారై, ప్రభుత్వాలకు కొన్ని కోట్ల రూపాయలు పన్నులరూపేణా చెల్లించే యీ పరిశ్రమలో అరాజకమే వుంటే, ఆ అరాజకాన్ని అరికట్టడానికి ప్రభుత్వం యింతవరకూ ఒక్క చర్యా తీసుకోలేదు. సమాజ శ్రేయస్సుకు సంబంధించిన ప్రతి విషయంలోనూ బాధ్యతాయుతంగా ప్రవర్తించవలసి వున్న జాతీయప్రభుత్వం, ఫిలిమ్ పరిశ్రమను నిర్లక్ష్యం చెయ్యడమొక్కటే తన వైఖరిగా పెట్టుకుంది.

భారతీయచిత్రాలన్నీ ఉన్నతస్థాయివే కాకపోవచ్చును. కాని యేడాదికి యిరవై చిత్రాలైనా, కనీసం డజనుచిత్రాలైనా విదేశాలకు ఎగుమతి చేయదగినవి కనిపించవా అని సహజంగా ఆశ్చర్యం కలుగుతున్నది. మనదేశంలో ప్రదర్శించబడే విదేశీయ చిత్రాలు ఎక్కువగా అమెరికానుండి వచ్చినవే. ఇవన్నీ ఉత్తమచిత్రాలేననిగాని లేక ఒకేస్థాయిలో వున్నాయనిగాని అనడానికి యెవరూ సాహసించరు. అతి జుగుప్సాకరమైన చిత్రాల మొదలు అత్యుత్తమ చిత్రాలదాకా అన్నిరకాలూ అమెరికానుంచి వస్తున్నాయి. వీటిని అమెరికావారు యితర దేశాలకు ఎగుమతిచేయడానికి వెనకాడడంలేదు. ఏటేటా యీ చిత్రాలు యితర దేశాలనుండి కొన్ని కోట్ల రూపాయలు మూటగట్టుకు తీసుకుపోతున్నాయి. అందుచేత మన చిత్రాలు తక్కువ స్థాయిలో ఉన్నాయనీ, వాటిని యితరదేశాల్లో చూపించడం మనకు అప్రతిష్ఠ అనీ ప్రభుత్వం సాకులు చెప్పడం భావ్యంకాదు. మన చెత్త చిత్రాలు మనదేశంలో ప్రదర్శించబడడం మాత్రం మనకు ప్రతిష్ఠాకరమా? కాదు. అయినా, యీ దేశంలో చెత్త చిత్రాల ప్రదర్శనకు అంగీకరిస్తూ, యితర దేశాలకు ఎగుమతి చేయవలసి వచ్చేటప్పటికి ఆటంకాలు కలిగించడంలో అర్థం ఏముంది? చెత్త చిత్రాలు ఎక్కడ ప్రదర్శింపబడినా అవాంఛనీయాలే కదా!

అందుచేత ప్రభుత్వం ఈ విషయంలో, బ్రిటిష్ ప్రభుత్వ విధానాన్ని అనుసరించడం శ్రేయస్కరం. ఈ దేశానికి ఏటా 200 పైగా అమెరికన్ చిత్రాలు దిగుమతి అవుతున్నాయి. కనీసం ప్రతి పదేసి అమెరికన్ చిత్రాలకూ ఒక భారతీయ చిత్రమ్ము అమెరికాకు ఎగుమతి చేయవచ్చుననీ, ఆ చిత్రానికి అమెరికాలో విధిగా ప్రదర్శన సౌకర్యాలు ఏర్పాట్లు చేయాలనీ ఒక శాసనం నిర్మించడం ఉచితం. ఈ విషయమై అమెరికన్ డిస్ట్రిబ్యూటర్లతోనూ, ప్రభుత్వంతోనూ సంప్రదించిన మీదటే యీ యేర్పాట్లు చెయ్యవచ్చు. ఇటువంటి శాసనమూలంగా భారతీయ చిత్ర పరిశ్రమ నెదుర్కొంటున్న ఆర్థికవిపత్తు కొంతవరకూ చక్కబడవచ్చు. స్వదేశంలో చాలినంత మార్కెట్ లేనప్పుడు ప్రతివ్యాపారం, ప్రతి పరిశ్రమ యితరదేశాల్లో మార్కెట్లకోసం ప్రయత్నించడం సహజమే గదా.

ఈ విషయంలో శశిధర్ ముఖర్జీ చేసిన ప్రకటన సమర్థనీయంగానే వుంది. అయితే ఆ వ్యాసం చివరలో, ఆయన తను కళాకారుడినిగూడా ననేమాట కాసేపు మరిచిపోయి శుద్ధ వర్తకుడి దృష్టిలో ఒకముక్క అన్నాడు. "విదేశాలకు వెళ్లే భారతీయ చిత్రం నిజమైన భారతీయతను చూపించేదిగా వుండాలని కొందరంటున్నారు. అవసరంలేదు. మన రైతులు, మన పేదరికం, మన అనారోగ్య పరిస్థితులు ఇవి చూపించడం భారతీయతకాదు. చిత్రం వినోదకరంగా, మంచి కథకలిగి, టెక్నికల్ గా హాలీవుడ్, బ్రిటిష్, ఇటాలియన్ చిత్రాల సగటు స్థాయికి తగ్గకుండా వుంటే అది ఇతరదేశాల్లో సొమ్ముచేసుకోగలదు," అని ఆయన వ్రాశాడు.

పేదరికం ఒక్కటే భారతీయుల విశిష్టత అని ఎవరన్నారు? మన ఆచారాలు, సంఘనియమాలు, కళ, మతనమ్మకాలు ఇవన్నీ భారతీయసంస్కృతిలో భాగాలే. విదేశాలకు వెళే మనచిత్రాలకు సొమ్ముచేసుకోవడమొక్కటే ప్రధానలక్ష్యం కారాదనీ, భారతీయసంస్కృతిని - విదేశాలకు చాటిచెప్పే రాయబారులుగా అవి ఉండాలనీ కోరడంలో బేసబబేమీలేదు. "అమెరికన్ వే ఆఫ్ లైఫ్"ను మహోత్కృష్టమైనదిగా చిత్రించే చిత్రాలు అమెరికానుంచి రావడం లేదా? అలాగే మన చిత్రాలు యథార్థ భారతీయజీవితాన్ని చిత్రించేవిగా ఉండాలనడం గొంతెమ్మ కోరకకాదు. "ఆన్" చిత్రం లండనులో ప్రదర్శింపబడినప్పుడు "హాలీవుడ్ ఇమిటేషన్" అని కొన్ని పత్రికలు విమర్శించాయి. ఇటువంటి ఇమిటేషన్ చిత్రాలను విదేశీయులు ఎల్లకాలం ఆదరించరు. అందుచేత భారతీయ చిత్రాలు భారతీయ సంస్కృతిని అంటిపెట్టుకుని వుంటేనే వాటికి భవిష్యత్తు వుంటుంది.

విదేశాలకు భారతీయచిత్రాల ఎగుమతిని ప్రభుత్వం ప్రోత్సహించిననాడు మన చిత్రాల స్థాయిలో, కథల్లో, టెక్నిక్‌లో కాలక్రమాన అభివృద్ధిరాగలదు. విదేశాలకు

(50 వ-పేజీ చూడండి)

# ప్రశ్నలు-సమాధానాలు

కె. వి. జ. కృష్ణమూర్తి—గుంటూరు.

డబ్బుకోసం మన నటీనటులు ఎక్కువ చిత్రాల్లో బుక్ కావడంకంటే కళనే ఆదర్శంగా పెట్టుకొని తక్కువ సంఖ్య గల చిత్రాల్లో నటించడం చాల ఉత్తమం అంటాను. మరి మీరేమంటారు?

—ఆదర్శాలు వినడానికి బాగానే వుంటాయి. ఆచరణలో పెట్టే దెవరు, పెట్టించే దెవరు?

*    *    *

ఎస్. కామేశ్వరరావు—గుడివాడ.

మన తెలుగు పేపర్లు తిరుచ్చి, మధుర మొదలగు పెద్దవూళ్ళలో తెలుగువారికి లభ్యమవుట లేదు కాని "దినమణి" మా ఊళ్లో గూడా దొరుకును. మిగిలిపోవును. కారణము?

—తమిళులతో పోల్చి మాస్తే తెలుగు వారిలో పేపర్లు కొనే అలవాటు చాలా తక్కువ.

*    *    *

కె. రామమూర్తి—నెల్లూరు.

దేవుడు ఏ ప్రదేశంలోనైనా, కొండల మీదనే ఎందుకు వెలుస్తాడు? ఉదా॥ తిరుపతి వెంకటేశ్వరులు, కనకదుర్గ యిత్యాది.

మానవులకంటే తాను ఉన్నతస్థాయికి చెందినవాణ్ణని ఆయనభావమేమో. అయినా భగవంతుడి చిద్విలాసాలకు మనం కారణాలు తెలుసుకోగలమా?

*    *    *

పి. వి. సుబ్బారావు—ప్రొద్దుటూరు.

జెమినీ వాసన్ గారు, తమ అవ్వయార్ చిత్రమును గురించి మన ఆంధ్రమంత్రులు ప్రకాశంపంతులు, సంజీవరెడ్డి, విశ్వనాథం గార్లు వెలిబుచ్చిన అభిప్రాయాలను పత్రికలలోనే గాకుండా సినిమాథియేటర్లలో కూడా రికార్డుద్వారా వినిపించుటలో వారి అభిప్రాయ మేమిటో తెలుపవలయును.

—వాసన్ గారికి చిత్రం మంచిచెడ్డలలో ఎంత నమ్మకంవున్నాదో పబ్లిసిటీలోకూడా అంత నమ్మకం వున్నది. బెర్నార్డుషా యేమన్నాడు? "ఎడ్వరైజ్, ఎడ్వర్టైజ్, ఎడ్వర్టైజ్" అన్నాడు.

గత నెలలో "లక్ష్మి." "పెంపుడు కొడుకు;" "ప్రతిజ్ఞ." యీ మూడు చిత్రాలుకూడా విడుదలచేశారు. ఇలా చిత్రములు పోటీపడుతుంటే సరిగా డబ్బు సంపాదించలేక దెబ్బతినును. నెలకు ఒక్క కొత్త చిత్రము మాత్రమే రిలీజు చేసినయెడల నిర్మాతలు డిస్ట్రిబ్యూటర్లుకూడా లాభపడుదురు గదా.

—నెలకు ఒకే చిత్రం విడుదలచేస్తే ఏడాదికి పన్నెండు చిత్రాలే విడుదల అవుతాయి. ప్రస్తుతం ఏటా 30 చిత్రాలదాకా తయారవుతున్నాయి. అందు చేత నెలకొకటి విడుదలచేయడం అసంభవం కాదూ.

*    *    *

వి. చంద్రశేఖరరావు—బందరు.

అతివాది, మితవాది, అవకాశవాది, అభ్యుదయవాది అని కొంతమందిని విభజిస్తారు. ఎవరెవరికి ఏ లక్షణాలు ఉంటాయండి?

—అతివాది అతిగావాగుతాడు, మితవాది మితంగా వాగుతాడు. అవకాశవాది వీలునుబట్టి వాదిస్తే వాదిస్తాడు, లేకపోతే ఒప్పేసుకుంటాడు. అభ్యుదయవాది అస్తమానం అందరి అభ్యుదయంగూర్చి కలవరిస్తాడు.

*    *    *

సన్నపురెడ్డి వెంకటరెడ్డి—కోవూరు.

నికోలాయ్ గొగోల్ రచించిన 'దిక్లోక్' కథను మీరెలా సంపాయించ గలిగారు? అటువంటికథలను రష్యన్ ప్రభుత్వం ఇతర దేశాలవారికి చిక్కనివ్వదే!?

గొగోల్ కథలు ఏ ప్రభుత్వపు సొంత ఆస్తీ కావు. అతడి జీవితకాలం 1809 నుండి 1852 వరకూ అని 11-11-53 వారపత్రికలో ప్రకటించినది మీరు చూడలేదా? అతడు వ్రాసినకథ ఆరోజుల కథ; యీ రోజులకథ కాదు. ఇప్పటి రష్యన్ ప్రభుత్వం 1917 లో మాత్రమే అధికారానికి వచ్చింది.

*    *    *

క్రొవ్విడి అచ్యుతరామయ్య—ఆకివీడు, (ప. గోదావరి జిల్లా)

స్వర్గీయ కళాప్రపూర్ణ డాక్టరు చిలుకూరి నారాయణరావు గారు తెనుగునందు లక్ష సామెతలు సేకరించి పుస్తకరూపంగా ప్రకటించెదమని ప్రకటించిరి. సదరు పుస్తకములు ప్రకటించిరా?

—వారు లక్ష సామెతలు సేకరించారు. ప్రకటించకయే పరలోకగతులైనారు.

కొప్పర్తి రామారావు—భీమవరం.

కవిత్వం అంటే ఏమిటి? అది ఎలా ఉద్భవిసుంది? ఎలా అభివృద్ధి అవుతుంది?

—కవి హృదయంలోంచి కవిత్వం ఉద్భవించి కవి వాక్కు ద్వారా అభివృద్ధి అవుతుంది. మన హృదయాన్ని కదలించి కరగించేది కవిత్వం అని మనం గ్రహించక తప్పదు. కవియైనవాడే కవి హృదయం గ్రహించి, కవిఎవడో గ్రహించగలడు. ★

## పుస్తక పరిచయం

### 'ప్రింటెక్'

ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ ప్రింటింగ్ టెక్నాలజిస్ట్స్ వారి అధికార పత్రిక ప్రథమసంచిక మా కార్యాలయానికి చేరింది. ముద్రణపరిశ్రమలో నిష్ణాతులైన భారతీయులందరినీ ఈ సంస్థలో సభ్యులుగా చేర్చుకొని, ముద్రణకు సంబంధించిన సాధక బాధకాలను పరస్పరం చర్చించుకొని పరిదిద్దుకోవటానికీ, ముద్రణలో ఎప్పటికప్పుడు కొత్త సొగసులు తేవటానికీ యీ సంస్థవారు కృషి చేస్తారు. కృషి ఫలితాన్ని యీ పత్రికద్వారా సభ్యులకీ, ప్రజలకీ వెల్లడి చేసుకొంటారు. ఈపత్రికకు డి. రత్నస్వామి గారు సంపాదకుడు. కార్యాలయం, 26, బ్రాడ్వే, మద్రాసు-1. సభ్యులకు ఉచితంగాను, యితరులకి సాలుకి రు. 3 ల చందామూలంగాను పత్రిక లభ్యమాతుంది. ★



# అదీ - ఇదీ

(48-వ పేజీ తరువాయి)

తమ చిత్రాలు ఎగుమతిఅయ్యే అన్యదేశ సంప్రదాయాలకోసం నిర్మాతలు తప్పకుండా కృషిచేస్తారు. విదేశీయుల అభిరుచులను అనుసరించి, పాటలు తగ్గించడం, మాటలు తగ్గించడం, చిత్రం పొడుగు తగ్గించడం మొదలైన మంచిపనులు చేస్తారు. ఈ పనులవల్ల మన చిత్రాలు విస్తృతిగా బాగుపడతాయి. ఈ విషయం గురించి ప్రభుత్వం పైన సూచింపబడిన కాలపరిమితిని నిర్ణయించడం అత్యవసరం. ★

—గోకుల్ వారి "నిరుపేదలు"లో నాగేశ్వరరావు

"అన్నదాత"లో అత్తగా సురభి కమలాబాయి, కామయ్య నాయుడుగా రంగారావు, నౌకరు శేషన్నగా కుటుంబరావు.

## ★ సినిమా వార్తలు ★

ఈస్టిండియావారి హాస్యచిత్రం "పక్కింటి అమ్మాయి" ఈనెల పదకొండవ తేదీన కాక పదహారో తేదీన విడుదల అవుతుందట. ఈ చిత్రానికి విజయవంతమైన ఒక బెంగాలీచిత్రం ఆధారం. తెలుగులో మాటలు, పాటలు ముద్దుకృష్ణ వ్రాశారు. సంగీతం అశ్వత్థామ సమకూర్చారు.

* * *

విజయావారి "చంద్రహారం" జనవరి 6 వ తేదీన విడుదల అవుతుందని తెలుస్తోంది.

* * *

ఆర్. కె. ఫిలిమ్స్‌వారి "ప్రేమలేఖలు" ఈ నెల 18 న విడుదలకానున్నదట. నర్గీస్, రాజకపూర్, విజయలక్ష్మి, ప్రాణ్ నటించిన యీ చిత్రానికి దర్శకుడు రాజా నవాథే. తెలుగులో మాటలు, పాటలు ఆరుద్ర వ్రాశారు. సంగీతం శంకర్, జైకిషన్ సమకూర్చారు. పేరునుబట్టే యీ చిత్రం ప్రేమకథగలదని తెలుస్తుంది.

★

ఈస్టిండియావారి "పక్కింటి అమ్మాయి"లో నాట్యంచేస్తున్న అంజలీదేవి.

★

[illegible]



(9-వ పేజీ తరువాయి)

అనుకున్న మాట అక్షరాలా జరిపించి తీరాల్సిందే. ఈ చిరాకు పరాకు లేవీ పనికి రావు, అని హెచ్చరించుకొని రిష్టు వాచీ చూశాను. పెద్దముల్లప్పుడే యిరవై తొమ్మిదో నిముషాన్ని దాటుతోంది "ఇంక నీతో పనిలేద"నుకొని సెకండ్లముల్లు మీదికి మరలించా చక్షువుల్ని. కాలమనే టేపుని చుట్టి పారేస్తున్నట్టు చకచకమని శరవేగంతో తిరిగిపోతోంది సెకండ్లముల్లు. పదీ, ఇరవై, ముప్ఫై, నలభై, యాభై అప్పుడే దాటేసింది. సరిగ్గా అరవయ్యో అంకె దాటేసరికల్లా అడుగు వేద్దామని ఫిజిక్సు ఎక్స్‌పెరిమెంటేదో ప్రారంభించబోయేవాడిలా చూస్తున్నా. అందులోను కొంచెం ముందుకువంగి, రిస్టువాచీ వంకే చూస్తూ, 'స్టార్ట్' అనగానే పరిగెట్టడానికి సిద్ధంగా ఉన్న రేసు రన్నరు పోజులో నిల్చున్నా.

ఏభైయేడో సెకండు దాటిపోయింది. యాభైతొమ్మిది దగ్గరకొస్తోంది.

హఠాత్తుగా నా చెయ్యి దృష్టిపథంలోంచి తప్పిపోయింది! పక్కనించెవడో దూసుకు పరిగెట్టిపోతున్నాడు. ఇంతట్లో వెనకనుంచి 'బాంయ్' మంటూ హారను వినిపించింది. అనుకోకుండా ఒక్కసారి తిరిగి చూసి వెంటనే వాచీ చూసుకునేసరికి సెకండ్లముల్లు అరవై దాటిపోయి అప్పుడే రెండో సెకండు దగ్గర ఉంది!

ఎక్స్‌పెరిమెంటంతా పాడయిపోయింది!

"ఇప్పుడేం చెయ్యను? తొమ్మిదిన్నర అయిపోయిందికదా యింకా ఉంటే మాట తప్పిపోయినట్లవుతుందేమో. పోనీ వెళ్ళిపోదామంటే ఇంతసేపూ ఉండి బస్సు వస్తూంటే యిప్పుడా?"

ప్రతిజ్ఞాపాలనం ముందుకు నెట్టుతోంది. ఆశాపాశం వెనక్కు లాగుతోంది. ఎటు వెళ్ళడానికీ తోచలేదు.

"అయినా ఆ వెధవెవడో సరిగ్గా సమయానికే చెయ్యి తూలగొట్టేశాడు. సిగ్గులేకుండా అంబోతు కోడిలా రోడ్డుమీద పరిగెడుతూను. ఛీ వాణ్ణించే అయిందిదంతాను. పారిపోయేడుగాని లేకపోతే పట్టుకుని న్యూసెన్సు కేసు పెట్టి డొక్క చించేద్దును." వాడిమీద కోపం అంతా గాలిలో చూపించేను.

"ఇంతకీ యిప్పుడెలాగూ తొమ్మిదిన్నర దాటిపోయింది; బయల్దేరడమూ అయింది కాదు. అంచేత ఈ హారనుమోతేదో చూసే పోదాం" అని నిల్చుండిపోయాను.

చివరకి ఆశాపాశమే గెల్చేసింది.

ఈ మానసిక యుద్ధంతో ఒక మూడునిమిషాలైంది. ఈలోగా మళ్ళీ ఏ శబ్దం వినిపించలేదు.

"కొంపదీసి అది బస్సు కాకుండా పోదుగదా. ఇంతా మాట కూడా..." అని భయపడుతూండేసరికల్లా 'బాంయ్' మని వినిపించింది.

"ఆఁ బస్సే!" ప్రాణాలు కుదుటబడ్డాయి. "అక్కడక్కడ ఆగుతూవస్తోంది కాబోలు. ఈ సిటీ సర్వీసువాళ్ళంతే. దారిలో ఎక్కడ పడితే అక్కడ ఆపేసి మనుషుల్ని ఎక్కించేసుకోవడం, అసలు హాలింగులదగ్గర ఖాళీ లేదని చెయ్యితిప్పుతూ ఆగకుండా పోతూండడం, ఇదో తమాషైన ఆటలాగుంది వాళ్ళకి. అయినా ఇప్పుడలా కాదులే. ఎంచేతంటే ఆలస్యాన్ని బట్టి చూస్తే చాలచోట్ల ఆగుతున్నట్లుంది. అంటే ఎక్కువ ఖాళీగా వుందన్న మాట."

నా 'రీజనింగు' నాకే వింతగా అనుపించింది. ఎలాగైతేనేం యీవిధంగా తర్జనభర్జన చేస్తూ పచార్లు కొడుతున్నా.

మళ్ళీ హారను వినిపించింది.

ఆఁ! దగ్గర కొస్తున్నది, వేగంగా రా అమ్మా! తల్లీ! ఇప్పటికే 9. 37 అయిందా, పోనీ ఓ అయిదు నిమిషాలు ఆలస్యంగా వెళ్లినా, ఎటెండెన్సు దక్కించుకోవచ్చు, పాఠం మాటెలా ఉన్నా" అని సర్దుకొని ఎదురు చూస్తున్నా.

మరోకసారి హారను శబ్దంతో బుర్రుమంటూ వంక తిరిగి దర్శనమిచ్చింది, యింతసేపటినుంచి నేను నిరీక్షిస్తూన్న...

"అరి దీని తస్సాదియ్యా! ఇదా యింతసేపూ ఉండుండి కూసింది" అప్రయత్నంగా నా నోటినుంచి మాటలొచ్చేశాయి, ఆపమనడానికి ఎత్తిన చేయి ఎత్తినట్లే ఉండగా.

ఏం చెప్పమంటారు? ఆ వస్తూన్నది సిటీ బస్సు కాదు, మునిసిపాలిటీ చెత్తలారీ!!! ఇందాక అక్కడక్కడ ఆగడం మనుష్లెక్కించుకుందికి కాదు, చెత్త నెత్తించుకోడానికి. ఛీ ఆశాపాశం ఎంత పని చేసింది? అయినా యీ సిటీ బస్సు నెవడు నమ్మమని చెప్పేడు! దేవుడిచ్చిన కాళ్ళతో హాయిగా నడిచిపోకుండా? బుద్ధి వచ్చింది బాబూ! ఇంక జన్మలో మళ్ళీ యిటువంటి తెలివితక్కువ పని చెయ్యను. అని లెంపలేసుకున్నాను.

అప్పటికే తొమ్మిదీ నలభై అయింది. ఇంక జట్కా కట్టించుకున్నా, అది "స్పెన్సరు అప్" ఎక్కేసరికి సూర్యుడూ నడినెత్తిమీది కెక్కుతాడు. అంచేత డబ్బు దండుగే గాని మరేం లాభం లేదు. అయినా యివాళ చేసిన తప్పిదానికి శిక్షగా యీ ఎండలో నడిచి వెళ్ళాల్సిందే. ఎలాగా ఫస్టు పిరియడు 'హీటు' పాఠం పోయింది. ఆ హీటేదో యీ విధంగా అనుభవించినా కొంత బుద్ధి వస్తుంది, అనుకొని 'దేవుడా గోడా' అని బుర్రమీద రుమాలు వేసుకొని బయలుదేరాను, యూనివర్సిటీకి. ★

(11-వ పేజీ తరువాయి)

కాని ఎంతకాలమని ఇలా ఇంటివాళ్లతో మాటా మంతీ లేకుండా, ముళ్లమీదున్నట్లు, ఆ ఇంట్లో కాపురం చేయటమో, పున్నయ్యకు అర్థంగాక, చివరికి విసుగెత్తి మరో రెండునెలల్లో ఇల్లు ఖాళీచేసి ఇంకో ఇంట్లోకి మారాడు.

ఇప్పుడు చంద్రమ్మకు హాయిగా వుంది. ఎవరు వచ్చినా ఆ ఇల్లు తనదే అయినట్టు చంద్రమ్మ ముప్ఫయి రూపాయలకు దమ్మిడీ తగ్గితే ఇవ్వడానికి వీల్లేదని చెప్పేది. కాని ఆ చిన్న భాగానికి ఎవరూ ముప్ఫయి రూపాయలు ఇవ్వడానికి ఒప్పుకోలేదు.

పైగా పున్నయ్య కుటుంబాన్ని లేవగొట్టడానికి చంద్రమ్మ ఆంక్షలు విధించినందువల్ల, ఆ ఇంటివాళ్లు మంచివాళ్లు కాదనే పేరు మ్రోగిపోయింది ఊళ్లో.

ఆరునెలలు గడిచినా, పున్నయ్య ఖాళీ చేసిన భాగం ఖాళీగానే వున్నది. చంద్రమ్మ, అందుకు లోలోపల ఎంతో సంతోషిస్తూ, పైకిమాత్రం తోటికోడలుతో – "పోనీయి, ఎవరూ రాకపోతే హాయిగా ఇల్లంతా మనమే వాడుకోవచ్చు. వాళ్ళిచ్చే ముష్టి ఇరవై రూపాయలకీ నానా గోలచేసి ఇల్లంతా పాడుచేస్తారు. ఇప్పుడు చూడు ఇల్లెంత నిశ్శబ్దంగా హాయిగా వుందో, పిల్లల కొట్లాటలు, పేచీలు లేకుండా" అనేది.

చంద్రమ్మ ఆంతర్యం తెలుసుకోలేక ఆమె చెప్పిన మాటలకు 'ఊఁ' కొట్టేది; సుబ్బారావు భార్యా. ★

#  కాలక్షేపం 

(5-వ పేజీ తరువాయి)

వులు పిల్లలను పంపించే వారుకారు. కిరస్తానీ మతంలో తమ పిల్లలు చేరిపోతారని భయపడేవారు. అటువంటి పరిస్థితిలో మిషనరీ తెల్లదొరలు తమ బడికి వచ్చిన పిల్లలకు జీతంలేకుండా చదువు చెప్పతామని ఆశ పెట్టేవారు. పిల్లలకు తామే పుస్తకములు కొనిపెడ్తామని కట్టుకొనుటకు బట్టలుకూడా యిస్తామని వాగ్దానంచేసి, ఆకర్షించి ఆ విధంగా విద్యాదానం చేసేవారు. తమవద్ద చదువుకొన్నవారికి పెద్ద ఉద్యోగాలు యిప్పించేవారు. అంతేకాదు. కిరస్తానీమతం పుచ్చుకొన్నట్లయితే, ఇంకా పెద్ద ఉద్యోగాలు యిప్పించి, "అయ్! అప్పచ్చి! అన్నట్లుగా ఉచ్చపదవులలో హెచ్చు జీతాలిప్పించేవారు. ఈ విధంగా జనాన్ని యింగ్లీషు చదువులోనికి ఆకర్షించడమే కాదు. హిందూమత మమతి కూడా పోయేటట్లు చేసేవారు. స్వమత విముఖులనుగా చేసి, స్వజాతీయాభిమానహీనులనుగా చేసి, ఇంగ్లీషువారంటే అభిమానం కలిగేటట్లు చేసేవారు. హిందువులకు యీ విధంగా వారు పెంపుడు తండ్రులైనారు. జనక తండ్రిమీద అనురాగం లేకుండా చేసి, దత్తత తండ్రిమీదనే అనురాగం, గౌరవం వృద్ధి అయ్యేటట్లుగా చేయడం క్రయిస్తవ పాదిరీలు సాగించిన దత్తత హోమం – ఈ హోమంలో మన ఆత్మసంస్కారం ఆహుతి అయింది. మన వాళ్లు ఆంగ్లమానస పుత్రులైనారు. "హిందూ మతంలో గ్రహించదగిన మంచి ఏమీ లేదు. అది మూఢనమ్మకాలతో నిండిన వెధవాళ్ల మతం. ఏకాదశీ ఉపవాసం నాడు ఏమేమి తినరాదో, ద్వాదశి పారణం నాడు ఏమేమి తినవలెనో నిర్ణయించడం తప్ప, ఈ వంటయింటి శాకపాక నియమాలు తప్ప, యీ మతంవల్ల మనకు కలిగే కర్మపరిపాకం యింకేమీ లే"దని, గడచిన ఎన్నికల ప్రచార కాలంలో పండిత జవహరిలాలు నెహ్రూవంటి ఆంగ్ల విద్యాధికుడు ఒక ఉపన్యాసంలో అన్నాడంటే అందులో ఆశ్చర్యమేమీ లేదు. ఆయన పెరిగింది ఇంగ్లండులో. ఆయన చదివింది ఇంగ్లండులోని గురువులవద్ద. ఆయన ఆంగ్ల దొరల ఆబాల్య శిష్యుడు. ప్రపంచంలో సూర్యుడు మొట్టమొదట పడమట ఉదయించి తర్వాత తూర్పుకు వస్తాడనే చదువు అది. జ్ఞానభానుడు అక్కడనుంచి ఇక్కడకు రావలసినదే యను స్థిరసిద్ధాంతముతో పడమటికి తిరిగి నమాజు చేయవలెనను నమ్మకము మనకు రక్తగతం చేయడంకోసం ఆంగ్ల ప్రభుత్వం అమోఘంగా కృషిచేసింది— ఆ విధంగా మనలను ఆంగ్లగురువులకు దాసోహం అనేటట్లు చేసింది.

ప్రజలబుద్ధిని వశీకరణం చేసికోవడం అనేది చాలా గొప్పవిద్య. అటువంటి ప్రజాహృదయ వశీకరణ తంత్రంవల్లనే ఎన్ని రాజ్యాల ప్రజలనైనా తమకు గులాములుగా చేసికోవచ్చుననే ప్రయత్నం పాశ్చాత్య ప్రభువుల సామ్రాజ్య విస్తరణ సూత్ర రత్నం.

కాని, కాలంమారింది. కాలం కళ్లు తెరిచింది. ప్రజలకు ఉపదేశాలుచేసి అరచేతిలో వైకుంఠంచూపించినంత మాత్రంచేత "అడియేన్! దాసోహం" అనడంలేదు. తియ్యనిమాటలు చెప్పినా, తీర్థంయిచ్చినా, గురుభావం కలగడం లేదు. అందువల్ల అమెరికావంటి దేశం అడిగినవారికి లేదనకుండా అప్పు యిస్తోంది. "ఇదిగో హిరణ్యం" అంటున్నది పరిషియా ప్రభుత్వానికి. "త్వమేవ శరణ్యం" అని తన పాదతీర్థం కూడా నెత్తిమీద జల్లుకోమంటుంది. పాకిస్తానులో కూడా అమెరికావారు శిష్యసంచారం చేస్తున్నారు. ధనకాంక్షతో వారికి పాదపూజ చేసేవారు వారికి కావాలి.

అయితే, అమెరికావారు ఇంతంత పైకం యీవిధంగా అప్పులిచ్చి వదజల్లడంవల్ల వారికేమిటి లాభం? ప్రపంచ రాజ్యాలన్నియు వారిచ్చిన అప్పులవల్ల వారికి భుక్తమై పోగలవనే ఆశ ఉంటుంది. అందువల్ల పృథివిని అప్పుచేత జయించడం అనేది అమెరికావారి ఆధునిక అతి నవీన ఆక్రమణ తంత్రం.

అమెరికావారి తంత్రం బాగా కొనసాగి, వారికోరికలు తీగెలుసాగి, పుష్పించి, ఫలించినట్లయితే, అఖిలప్రపంచం వారి అప్పుల మూలంగా చుట్టివేయబడినదై వారికి హస్తగతం కాగలదనే ధైర్యం వారికిఉంది. పృథివిని వశపరచుకొనేది అప్పు అని ఈ పృథివీపతుల నూతన సిద్ధాంతం. భూవలయము "అప్పు" (ఉదకం) చేతనే చుట్టూ ఆవరింపబడింది కనుక.

"తగజల రేఖచే వలయితంబగు
కొంచెపు మట్టిముద్ద"

యీ ప్రపంచం అనే సంగతి అమెరికా గ్రహించింది.

★

# వీరులూ, వారసులూ

(8-వ పేజీ తరువాయి)

గుత్తికొండబెళంలో యాత్రికుల కదృశ్యుడై కారెమపూడి నాటినుండి తపస్సాచరిస్తూన్న బ్రహ్మనాయుడి కథ కోటిలింగానికి స్మృతికి వచ్చినది. తనా తపోధనుడి ముందేనా వున్నది? కోటిలింగం గడ్డిపోచవలె వణకిపోయినాడు.

చీకటిని చీల్చుకొని ఎట్టకేలకు శబ్దం వినవచ్చింది. గదంతా యీ శబ్దంతోనే వెలిగినట్లయినది.

"ఎందుకో భయం కోటిలింగాలు? నా అవసరం నీకింకా ఒక వారమే వున్నది. ఆ తరవాత నీవే నేను; నేనే నీవు. నీఅవసరమూ యీవారం దినాలే, ఆ తరవాత నేను లేను."

కోటిలింగం యీ అవ్యక్త పదాలను సమన్వయించుకో ప్రయత్నించలేదు. ఆ చీకటినుండి బయటపడితే చాలుననుకొన్నాడు. అతడు తిరిగి మాట్లాడనూలేదు. ప్రమిదె తిరిగి వెలిగింది. ఆకలిదాసుడు యింటివేపు దారితీశాడు. రామానుజయ్యతాత తాంబుర తిరిగి మోగినది.

తాయారమ్మ పొంతకుండలో వేణ్ణీళ్లు తోడింది. నీళ్ళు పోసుకొన్నాక గంజి గిన్నెలో వుప్పు కలిపి ముందుపెట్టింది.

"పిల్లల కందరికీ జ్వరం."

పాతపీట దిగి మగ్గం గదిలోకి దిగ్గున నడిచివెళ్ళాడు కోటిలింగం. మగ్గం గుంటమీది గట్టుపైన కింద నీళ్లు, పైన కిరసనాయిలుతో వెలుగుతున్న మసిబుడ్డి కాంతిలో తనబిడ్డలమీద చెయ్యివేసి చూచాడు.

"నువ్వు వాళ్ళకైనా చెప్పకుండా పోతివి. దిగులుపడ్డారు." అని తనుగూడా ఆగదిలోకే వచ్చింద తాయారమ్మ. ఆమె మాట వినిపించుకోకుండానే పిల్లల పక్కనే కోటిలింగంపడుకున్నాడు. నిద్రపోయాడో లేదో ఎవరికీ తెలియదు. (ఇంకా వుంది.)

# ★ పీటర్ పాన్ ★

(46 వ పేజీ తరువాయి)

లాగ, కాంతిబంతిలాగ వుంటుంది. ఆమె ముందు వుండి దోవ చూపిస్తుండగా పీటర్ పాన్, వెండీ, జాన్, మైకేల్ గాలికెరటాల గుర్రాలమీద స్వారిచేస్తూ, కిటికీలోంచి బయటికి వచ్చి, యెగురుతూ వెళ్ళిపోయారు. వాళ్లే నష్టగించేందు కెవరూ లేరు. తలిదండ్రులు బెంగపెట్టుకుంటారేమోననికూడా ఆలోచించకుండా పీటర్ పాన్ చెప్పిన దూరదూర స్వప్నద్వీపానికి ముగ్గురు పిల్లలూ ప్రయాణమయ్యారు.

(ఇంకావుంది)

#  మనిషిలో మనిషి 

(33-వ పేజీ తరువాయి)

జెకిల్ విషయంలో ఇంకా ఏదో అగాధమైన అంతరార్థం ఉండి తీరాలి.

వారంరోజులైన తర్వాత డాక్టరు లాన్యను మంచంపట్టి, పదిహేనురోజులలోపలనే స్వర్గస్థుడైనాడు. ఆయన అంత్యక్రియలకు అట్టర్సను వెళ్లాడు. ఆనాటిరాత్రి అట్టర్సను తన కచ్చేరీ గదితలుపు తాళం వేసి లోపల కూర్చుండి బిక్కుబిక్కుమంటూ వెలుగుతున్న ఒక కొవ్వొత్తిదీపపు వెల్తురులో సీలువేసిన ఒక కవరు ఉత్తరం తన ముందర ఉంచుకొని పరిశీలించడం ప్రారంభించాడు. స్వర్గస్థుడైన తన మిత్రుని స్వదస్తూరీతో దానిమీద అడ్రసు వ్రాయబడి ఉంది. ఆయనసీలుతోనే దానిమీద సీలు వేయబడి ఉంది. "ఇది అంతరంగికం—జే. జి. అట్టర్సను చేతికే యీ ఉత్తరం యివ్వాలి. నాకంటేముందుగా ఆయనే గతిస్తే దీనినెవ్వరూ చదువకుండా ధ్వంసం చేసివేయాలి" అని ఆ కవరుమీద ఖండితంగా వ్రాయబడి ఉంది. అందువల్ల ఆ కవరులోని అంశములను చదివి చూడడానికి లాయరు భయపడ్డాడు. "ఒక మిత్రుణ్ణి ఈవేళ భూస్థాపితం చేసి వచ్చాను. దీనిమూలంగా మరొకణ్ని నేను నష్టపడితే మాత్రమేమిటి?" అని అట్టర్సను తనలో తాను అనుకొన్నాడు. తాను ఆ ఉత్తరంలోది చూడడానికి వెనక్కు తీయడం తన మిత్రునకు ద్రోహంచేయడమే అని నిర్ణయించి ఆ సీలును ఛేదించాడు. ఆ కవరులోపల మరొక కవరుఉంది. దానికికూడా సీలుఉంది. "డాక్టరు హెన్రీ జెకిల్ మరణించేవరకుగాని, అదృశ్యుడయ్యేవరకు గాని దీనిని తెరువకూడదు" అని ఆ కవరుమీద స్పష్టంగా వ్రాసిఉంది. అట్టర్సనుకు ఇదంతా మాయగా ఉంది. అవును. అదృశ్యుడు కావడమే. ఆ పిచ్చి వీలునామా కాగితంలో ఆలాగే వ్రాసి వుంది. దానిని చాలారోజులక్రిందటనే అసలు ఆసామీకి అట్టర్సను వాపసు చేశాడు. "హెన్రి జెకిల్ పేరున్నూ అతని అంతర్థానం అనే మాటయున్నూ తిరిగీ యిక్కడ కన్పిస్తున్నాయి. హైడ్ అనేవాని కుత్సితపు సలహానను సరించి ఆవీలునామాలో ఆమాటలు వ్రాయబడినాయి. చాలా స్పష్టంగా దారుణంగా పైకి కన్పిస్తూఉన్న దురుద్దేశంతో ఆమాటలు వీలునామాలో చేర్చబడినాయి. కాని, ఆమాటలే తిరిగీ డాక్టరు లాన్యను స్వదస్తూరీలో వ్రాశాడంటే, ఆమాటల అర్థం ఏమిటి? కవరు ఉత్తరమును తెరువరాదనే నిషేధం ఉన్నప్పటికీ, దానికి తాను ధర్మాధికారిగా ఉన్నప్పటికీ, దానిని తెరచి చూడవలెననే ఆసక్తి అట్టరసనుకు కలిగింది. ఈ గూఢతంత్ర మర్మవ్యవహారం అంతు కనుక్కోవలెనని బుద్ధి పుట్టింది. కాని, తన లాయరు వృత్తి మర్యాద ప్రకారంగా, తన మిత్రునకు తాను నమ్మకద్రోహం చేయరాదనే భావంతో మిత్రుని కోరికను అట్టర్సను చెల్లింపవలసినవాడయ్యేను. అందువల్ల అతని ఇనుపపెట్టెలో అంతర్గర్భితంగా ఒకమూల భద్రంగా ఆ కవరు పడిఉంది.

రహస్యమైనదాని ఆమూకీ తెలిసికోవలెననే కుతూహలాన్ని అణచివేయడం ఒక ఎత్తు దానిని పూర్తిగా జయించడం ఇంకొక ఎత్తు. అతనికి ఇక మిగిలినమిత్రుణ్ణి అయినా కలిసికోవలెననేకోరిక అతనికి అదివరకు ఉన్నంత హెచ్చుగా ఆనాడు మొదలుకొని ఉన్నదని చెప్పడానికి వీలులేదు. తనమిత్రుడైన డాక్టరు జెకిల్ విషయంతో స్నేహానురాగం ఉంది. కాని, ఆయనను స్మరించినప్పుడు మనస్సు కలవరపడి కంపించేది. అతనిని చూడడానికి కూడా వెళ్ళాడు. కాని లోపలికి రానివ్వక పోవడంవల్లనే ఆయన మనస్సుకు హాయిగా ఉన్నట్లుంది. స్వగృహంలోనే కారాగృహంలో ఉన్నట్లుగా బంధించుకొనికూర్చున్న అగమ్యగోచర మానవునితో కలిసి కూర్చుండి సంభాషించడంకంటె, ఆయింటిగుమ్మంవద్దనే కొంచెంసేపు నిల్చుండి విశాలమైన లండను నగరపుగాలి వెల్తురూ సందడీమధ్య ఆయింటిబట్లరైన పూల్‌తో రవ్వంతసేపు సంభాషించి వెళ్ళిపోవడమే అట్టర్సనుకు మంచిదనిపించింది. పూల్ చెప్పే వార్తలలో కూడా చెవికింపయినవిషయాలేమీ ఉండడంలేదు. డాక్టరు జెకిల్ ఇదివరకుకంటె యిప్పుడు పరిశోధనామందిరానికి ఆవలఉన్న గదిలోనే సదా ఉంటున్నాడట. తరచు అక్కడే నిద్రపోవడం కూడా జరుగుతోంది. మనిషిలో ఖుషీ లేదు. పూర్తిగా మౌనముద్ర వహించాడు. గ్రంథ కాలక్షేపంకూడా లేదు. ఆయనమనస్సులో

ఆయనను ఏదో వేధిస్తూ ఉన్నట్లుగా ఉంది. ఎన్నాళ్లు చూచినా, డాక్టరు జెకిల్‌నుగూర్చి యీవిధమైన వార్తలనే నిరంతరంగా వింటూఉన్న కారణంచేత, డాక్టరు యింటికి తరచు పోవడంకూడా అట్టర్సను తగ్గించేశాడు.

## 7

## కిటికీవద్ద విశేషం

ఆనాడు ఆదివారం. ఎన్ఫీల్డ్‌తో కలిసి అట్టర్సను మామూలుప్రకారంగా షికారు బయలుదేరాడు. తిరిగి వారిద్దరూ వెనుకటి సందులోనుంచి నడవడం ప్రారంభించారు. ఆ గుమ్మందగ్గరకు రాగానే అక్కడ ఆగి దానివంక ఎగాదిగచూడడం ప్రారంభించారు.

"సరి. ఆకథ సర్వం సమాప్తం అయినట్లే ఇక. హైడ్ చూపులు యిక మనకు లేవన్న మాటేకదా!" అని ఎన్ఫీల్డ్ అన్నాడు.

"ఇక లేవనేఅనుకుంటాను. నేనొకసారి అతనిని కలిసికొన్నాను. అతన్ని చూస్తే నీకెంత వెగటు పుట్టిందో నాకుకూడా అంత వెగటు పుట్టింది. ఈవిషయం నీకు నేను ఎప్పుడైనా చెప్పానా? అని అట్టర్సను ప్రశ్నించాడు.

"అతణ్ణి చూడడం అంటూ సంభవిస్తే, వెగటు పుట్టకపోవడం అసంభవం. అది అలా ఉండనియ్యి. ఈ గుమ్మం డాక్టరు జెకిలు మకాముకు కేవలం దొడ్డిగుమ్మం. వెర్రి వెంగళప్పలాగున యీమాత్రం తెలిసికోలేకపోయినాను. నీవు పొరబాటుపడడంవల్ల నే ఆసంగతి నేను గ్రహించడం జరిగింది" అని ఎన్ఫీల్డ్ బదులు చెప్పాడు.

"అయితే, నీవు ఆ విషయం తెలిసికొన్నావన్న మాట. అలాగయితే, మనము పెరటిజాగాలోకి వెళ్ళి కిటికీలవైపుచూచి రావచ్చు. నిజం చెప్తున్నాను నీకు. పాపం! జెకిల్‌విషయంలో ఏంచెయ్యాలో నాకేమీ తోచడంలేదు. అతనివద్ద బయటనే సమీపంగా మిత్రుడెవరైనా ఉంటే, అతని మనస్సుకు కొంత హాయి కలుగుతుందని నాకు తోస్తోంది" అన్నాడు అట్టర్సను.

పెరటిజాగాలో ఎక్కువ చల్లగా, కొంచెం తేమగా ఉంది. అస్తమించే సూర్యుని కాంతితో పైన ఆకాశం ప్రకాశిస్తోంది. అయినప్పటికీ, ఆ పెరటి జాగా అంతా, కొంచెం త్వరగానే సాంధ్యరాగపు నీరెండతో నిండి ఉంది. మూడు కిటికీలలో మధ్య కిటికీకి తలుపులు సగం తెరువబడి ఉన్నాయి. దానికి దగ్గరగా ప్రక్కనే డాక్టరు జెకిల్ కూర్చున్నాడు. విసుగెత్తిన విరక్తుడైన ఖైదీలాగున, అమిత విషాద భారంతో ప్రయాసతో శ్వాస పీలుస్తున్నాడు.

"ఏమోయ్! జెకిల్! జెకిల్! ఇప్పుడు నీకు కొంచెం ఖులాసాగా ఉన్నదనుకుంటా" అని అట్టర్సను కేక వేశాడు.

"నాకేమిటో వంట్లో చాలా క్రుంగిపోయి నట్లుగా ఉంది. అమితంగా క్రుంగినట్లుంది. దేవునిదయ వల్ల యిది ఎక్కువకాలం ఉండదనుకుంటాను" అని డాక్టరు నీరసంగా అన్నాడు.

"నీవు ఇల్లుకదలకుండా బంధించుకొని కూర్చుండడం ఎక్కువైపోయింది. నేనూ, ఎన్ఫీల్డ్ తిరుగుతున్న మాదిరిగానే నీవుకూడా షికారుగా బయటికి వచ్చి ఒంట్లో రక్తాన్ని కొంచెం జోరు చెయ్యాలి (ఇదిగో డాక్టరు జెకిల్! ఇతను నాజ్ఞాతి సోదరుడైన ఎన్ఫీల్డ్) రావోయ్! టోపీ తగిలించుకో! మాతో సరదాగా ఒక్కచుట్టు తిరిగి రావచ్చు రా!" అని లాయరు అన్నాడు.

"నీవు చెప్పినదంతా బాగానే ఉంది. అలా చేస్తే బాగానే ఉంటుంది. కాని, వద్దు. వద్దుబాబూ! వద్దు. అదేమీ సాధ్యమయ్యేపని కాదు. నేను సాహసించి రాలేను. అట్టర్సన్! నిన్ను చూస్తే నాకు చాలా సంతోషమైంది. పరమానందం అయింది. నీవూ, ఎన్ఫీల్డ్ ఒకసారి పైకివస్తే బాగుండును. కాని, యీచోటు ఏమీ బాగాలేదు" అని డాక్టరు జెకిల్ ఒక్క నిట్టూర్పు విడిచాడు.

"అలాగయితే, మేము ఇక్కడనే క్రిందనిల్చుండి ఇక్కడనుంచే నీతో మాట్లాడుతూఉండడం ఉత్తమం" అని లాయరు సౌమ్యంగా అన్నాడు.

"ఆమాటే నీతో అనవలెననినా మనస్సులో అనుకుంటున్నాను" అని డాక్టరు చిరునవ్వు నవ్వుతూ తిరిగి అన్నాడు.

ఆమాటలు అన్నాడో లేదో, అతని ముఖంలో ఆచిరునవ్వు అంతర్ధానమైపోయి, ఘోరమైనభయమూ, దిగులూ ఆముఖంలో ప్రత్యక్షమైనాయి. అదిచూచి

## ★ మనిషిలో మనిషి ★

క్రింద నిల్చున్న ఆ యిద్దరు పెద్దమనుష్యులూ ఒంట్లో రక్తం గడ్డకట్టినట్లుగా స్తంభించిపోయినారు. ఆ ముఖవైఖరిని ఒక్కక్షణమే చూచారు. ఎందుచేతనంటే, కిటికీరెక్కలు వెంటనే క్రిందికి దిగిపోయినాయి. కాని, ఆక్షణమాత్రవీక్షణమే చాలు. వారిద్దరూ ఆ పెరటి ఆవరణలోనుంచి, నోటివెంట మళ్ళీ మాట లేకుండా, బయటికి వెళ్ళిపోయినారు. ఆ సందులోనుంచికూడా మౌనంగానే నడిచారు. ప్రక్కనున్న ఒక పెద్ద రహదారీమీదకు వచ్చారు. ఆదివారం అయినప్పటికీ ఆ రహదారీమీద అక్కడక్కడ జనసంచారం ఉంది. అప్పుడు అట్టర్సన్ చిట్టచివరకు ఒక్కసారి తన సహచరునివంక కన్నెత్తి చూచాడు. ఉభయుల ముఖాలూ తెల్లబోయినట్లున్నాయి. వారి కళ్ళల్లోని నిర్ఘాంత భయభ్రాంతి ఏదో బదులు జవాబు చెప్పినట్లుగా ఉంది.

"భగవత్కటాక్షం! భగవత్కటాక్షం!" అన్నాడు అట్టర్సను.

ఎన్ఫీల్డ్ చాలా ఆదుర్దాగా తల పంకించి మరల మౌనముద్రాంకితుడై ముందుకు నడచెను. ★

## ★ కోదండయ్యగారి కాపురం ★

(36-వ పేజీ తరువాయి)

కొక వుత్తరం రాశాను. అందులో యీవిధంగా వుంది:—

"మాష్టారూ! ఈ నెల మీ ప్రయివేటు పిల్లలజీతాలు మీకు చేరవు. — మీ శ్రేయోభిలాషి" ఈ వుత్తరం స్కూలు అడ్రసుకు వ్రాశాను. ఆ మర్నాటినుంచీ మా కోదండయ్యగారు కొంచెం దిగులుగా వున్నట్లు కన్పించాడు. మన వుత్తరం పని చేసిందిరా అనుకున్నాను.

ఫస్టుతారీఖు వచ్చింది. "ఒరేయ్! మీ జీతాలు యింకా తీసుకురాలేదేంరా?" అని అడిగారు. అసలు సంగతి చెప్పకుండా మేము అనుకున్నప్రకారం "ఇచ్చేశాంగదండీ!" అన్నాము.

"ఎప్పుడూ?... ఈ నెలదిరా!"

"అవునండి! మొన్న 23-వ తారీఖున యిచ్చాంగదండీ,"

ఈవిధంగా మేము దబాయించడం మొదలుపెట్టేసరికి ఆయన పేముబెత్తం తీసికొని, "జీతాలు ఎగవేద్దామని చూస్తున్నారటరా" అని కొట్టబోయారు. నేను గట్టిగా ఏడుపు మొదలుపెట్టాను. ఇంతలో సత్యవతమ్మగారు గబగబా యివతలకి వచ్చింది. కోదండయ్యగారి చేతిలో బెత్తం కింద పడిపోయింది. ఆమె కట్టుకున్న కొత్తచీరె చూసి ఆయన ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి! పీడు యేడుస్తున్నాడెందుకు?" అని ఆవిడ నన్ను చూపించి అడిగింది

"కాదే, ఈ నెలజీతంతో నీకు చీరెకొందామనుకుంటే వీళ్ళందరూ కలిసి జీతం యివ్వనంటున్నారే!"

"వాళ్లజీతం మొన్ననే యిచ్చేశారులే."

"నువ్వు తీసుకున్నావా?..."ఏదీ యిలా యివ్వు! ఆడబ్బు పెట్టి చీర తీసుకొస్తాను."

"ఇదుగో" అని కొత్త చీర చూపింది సత్యవతమ్మగారు.

"మిగతాడబ్బేదీ?"

"ఇంకెక్కడ మిగిలింది? చీరె కొనేస్తే!"

"ఆఁ! డబ్భై రూపాయల చీర కొన్నావా?" అని అడుగుతూనే మూర్ఛపోయారు కోదండయ్యగారు.

"ఏం, కొంటే? నీ తాతగాని ముల్లేమయినా పెట్టానా?" కొంచెం రౌద్రాకారం దాల్చింది.

ఇంకా మాట్లాడితే "అంతపనీ చేస్తుందేమో." అనుకున్నాడు గావల్ను, కోదండయ్యగారు, మళ్ళీ నోరెత్తితే వొట్టు. ★

## ★ అనుప్రాస ★

(23-వ పేజీ తరువాయి)

కాస్త తేరుకుని మళ్ళీ అన్నాడు.

"మోహిని మావగారే పాపం. కొడుకు పెళ్ళి మానికొనే ఇది లేదు"—వినగానే షాక్ తిన్నట్లు అయిగారు నోటమాట లేక నీరు కారిపోయారు ఆ విషయాన్ని గూర్చే చాలాసేపు వాళ్ళు ఆలోచించి సానుభూతితో నిట్టూర్పులు విడిచారు. "ఆయన ఇవాళ కాకపోతే ఎప్పుడో ఒక ప్పుడు పోయేవాడే! పిల్లపెళ్ళి అయాక పోతే అది 'పిల్ల పాదమహిమ' అని లోకులు పిల్లని నోళ్ళలో వేసికొంటురు. కాస్త ఆలస్యమౌతుంది అయితేం ఇదీ ఓ మంచికే అయింది" అని మనసులో కొంత సంతోషించింది మోహిని తల్లి

కట్నం మోజులో మేనరికాన్ని, కాదని భార్యతో పోట్లాడి విశ్వపతిగారి మోహినిని కొడుక్కి నిశ్చయం చేసి తనువు చాలించిన ఆ గజెటెడ్ ఆఫీసరుగారి గౌరవం నిలబడుతుందో; పెళ్ళికొడుకు తల్లితో పెక్కిభవించి ఇంత జరిగాకకూడ, మేనరికాన్నే వర్తిస్తాడో ఏం చెప్పగలం! ఇక ఏం చెప్పినా రచయిత ఇరుపక్షాలవారికీ చాలా అన్యాయం చేసినవాడౌతాడు. ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras